# విశాలాంధ్ర.



కుటుంబరావు : సుంకర : అనిశెట్టి : ప్రసాదరావు

ప్రయాగ : రామమోహన్ : తిలక్ : ఆరుద్ర : శ్రీరామమూర్తి

పరుచూరి : గంగినేని : పాలకోడేటి : డి. ఎ. ఎ. ఎస్.

* జ్యూలియస్ ఫ్యూజిక్ : ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ : టర్జినీవ్ *

## విశాలాంధ్ర వైజ్ఞానిక ప్రత్యేక సంచిక

# ఘుమ రెస్టారెంట్

## శ్రీ [illegible]రీ భోజన హోటల్

గవర్నరుపేట : : విజయవ



1, 2 క్లాసులవారికిగా ఆరితేరిన పనివారిచే సిద్ధపరచబడి రుచికరమైన పదార్థములతో మిమ్మానందింపజేస్తాం. మీ కాలం వృథాకాదు - అతి జరూరుగా అందిస్తాము.

## స్పెషల్ క్లాస్ భోజనం
## ఏర్పరుప బడుతున్నది

రాత్రిపూట పరుండుటకు మంచములు (మంచమునకు పావలా మాత్రమే) ఏర్పాట్లుగలవు. మీకు కావలసిన అన్ని వసతులు, సౌకర్యములు చేయబడుతున్నవి.



మానేజరు: ప్రొప్రయిటరు:
అన్నె ప్రకాశరావు కొర్లగంటి సత్యనారాయణ




# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక


| సంపుటి 2 | నవంబరు 1948 | సంచిక 9-11 |
|---|---|---|


సంపాదకులు:

కొమర్రాజు వినాయకరావు
ప్రయాగ కోదండరామశాస్త్రి
అనిశెట్టి సుబ్బారావు



గౌరవ సంపాదకులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ — పి. వి. రాజమన్నారు
దేవులపల్లి కృష్ణశాస్త్రి — తుమ్మల వెంకటరామయ్య
కొడవటిగంటి కుటుంబరావు

★ విశాలాంధ్ర వైజ్ఞానిక సంచిక ★

వెల ఎనిమిదణాలు



వీర తెలంగాణా బాల బాలికలు ఆటపాటల్లోగూడా రజాకార్లను ఎదుర్కొంటున్నారు

సంపుట 2 | సంచిక 9-11




నవంబరు 1948

ఆంధ్రాభ్యుదయ రచయితల మాసపత్రిక


# విశాలాంధ్ర సంస్కృతి

అనేకరాష్ట్రాలలో ముక్కలు ముక్కలుగా చెదిరివున్న ఆంధ్ర జాతి ఏనాటికైనా ఐక్యమై ఒకవిశాలాంధ్ర జాతీయ సంస్కృతిని నిర్మించుకోవాలని చిరకాలంగా ఆశించాము. మనదేశంలోని వివిధ జాతీయ సంస్కృతులు పరిపూర్ణ వికాసంతో పెంపొంది, సమగ్ర భారతీయ నాగరికతకు దోహదంచేస్తాయని భావించాము.

ఈమహదాశయ సాఫల్యంకోసం మూడుకోట్లమంది ఆంధ్రప్రజలం ఏండ్లతరబడిగా ఆందోళన చేస్తున్నాం. ఏకభాష, ఏక సంస్కృతిగల తెలుగుగడ్డను ఖండ ఖండాలుగాచేసి కొంత నిజాంనవాబుకు, కొంత మైసూరు మహారాజుకు, మరికొంత ఒరిస్సా ప్రభుత్వానికి కట్టబెట్టిన బ్రిటిష్‌ప్రభుత్వం తక్కిన దేశాన్నిగూడా తమిళ, కేరళ, కర్ణాటక భూభాగాలతో కలిపి, కృత్రిమంగా మద్రాసురాష్ట్రాన్ని నిర్మించి ఏకక



జాతికి స్వేచ్ఛ లేకుండా చేసింది చీల్చి పాలించే ఈ అమానుష విధానం ఆంధ్రజాతి కళా సంస్కృతుల నరికట్టింది

కాని, ఏ ప్రభుత్వమైనా ఒక జాతి ప్రగతిని చిరకాలం నిరోధించ లేదు స్వాతంత్ర్య సాధనకోసం మహోద్యమాలు నడపటంలోను, అందు కవసరమైన రాజకీయ సాంఘిక చైతన్యాన్ని లవరచుకోవడంలోను, అభివృద్ధి మార్గాల కడ్డునిలిచిన సంఘుశత్రువులను ఎదుర్కోవడంలోనూ క్రమ క్రమంగా ఆంధ్రజాతికి ఐక్యభావన, ఐక్యాచరణా, ఏర్పడ్డాయి బ్రిటిష్ ప్రభుత్వ నిర్గమనానంతరం ఆంధ్రప్రజల ఆశయం కార్యరూపం ధరిస్తుందనీ, విశాలాంధ్ర భాషా, సంస్కృతీ ఏర్పడతాయనీ ఆంధ్ర దేశం స్వతంత్రకళా, విజ్ఞానాలతో తులతూగుతుందనీ విశ్వసించాము కాని పదేపదే ఉవ్విళ్లూరించే ప్రకటనలతో ప్రజలను జోకొట్టడంతప్ప ఈవిషయంలో ఆంధ్రజాతీయ నాయకులు ఇంతవరకు తీవ్రంగా కృషి చేసిందిలేదు. మద్రాసు ప్రభుత్వం తన సర్వశక్తులను వినియోగించి రాష్ట్రనిర్మాణానికి తోడ్పడక పోవటంవారిసిర్లక్ష్యాన్నే బయల్పరుస్తుంది కేంద్రప్రభుత్వం, ఈవిషయాన్ని పరిశీలించడానికని ఒకకమిషన్ను నియమించినా భారత నాయకులు దీనిని దురభిమానంగా పేర్కొని, న్యాయమైన వివిధ రాష్ట్రాల ప్రజల జాతీయ వాంఛను తృణీకరిస్తున్నారు. మన రాష్ట్రంబైట, లోపలనున్న కొందరు వర్తక ప్రముఖులకో, ప్రభుత్వాధికారులకో ఇదిసంతోష దాయకం కావచ్చును. కాని, తెలంగాణ రైతుకూ, రాయలసీను కూలీకీ ఇది ద్రోహంగా కన్పిస్తే ఆశ్చర్యం లేదు.

ఒకజాతిలోని సామాన్యపౌరుని జీవితపరిస్థితులను బట్టి ఆజాతి వాంఛను అర్థంచేసుకోవాలి. నేడు విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను గుర్తించనిపౌరులు లేరు. దినదినం దుస్సహమౌతున్న నిజాంనవాబుదోపిడ దౌర్జన్యాలను ప్రతిఘటించి తొంభైలక్షలమంది తెలంగాణా ప్రజలు

చావుబ్రతుకుల సరిహద్దుల నడిచారు. ఎన్ని శతాబ్దాలు, ఎన్ని తరాలు! ఈ రాక్షసత్వం కింద నలిగి హతమైపోతే ఈ తెగింపు, సాహసం ప్రదర్శించి పోరాడి తెలుగుతల్లి కౌగిలిలో చేరుతామని శపథం చేశారో! పండని పొలాన్ని దీనంగా చూస్తూ, తనదికాని ధాన్యాన్ని మోస్తూ రాయలసీమ కూలీ ఎగ్గా కుంగి పోతున్నాడో! ఇటు నెల్లూరునుంచి అటు విశాఖ వరకూ గ్రామ జీవితాన్ని పిడికిట పిండుతున్న జమీందారులతో సంఘర్షించే రైతు ఎలాగ కసితో రగులుతున్నాడో! ఏ మహోద్యమాలు నిర్మిస్తున్నాడో! విద్యావంతులు, విద్యార్థులు, ఉద్యోగులు తామాశించే సుఖమయ జీవితం, వైజ్ఞానికాభివృద్ధీ పగటి కలలుగా మారుతూంటే అసంతృప్తితో, ఆవేదనతో ఆందోళన పడుతున్నారు.

వేరు వేరు ప్రభుత్వాల కింద మైనారిటీలుగా బ్రతుకుతూ, సరిహద్దులమధ్య చిక్కుకునివున్న కోట్ల కొలది ఆంధ్రప్రజలు ఐక్యమై, తమ జీవిత సమస్యలను సమిష్టిగా పరిష్కరించు కోగోరుతున్నప్పుడు దానికి విఘాతం కలిగించ పూనుకొనటం ఉప్పెనకు ఆనకట్ట కట్టడం వంటిది!

కనుక, సత్వరంగా విశాలాంధ్ర నిర్మాణం జరిగినప్పుడే ఆంధ్ర జాతి జీవితపరిస్థితులు చక్కబడి జాతీయ సంపత్తికీ, విద్యావ్యాప్తికీ స్వతంత్ర కళాసంస్కృతుల వికాసానికీ అవకాశం లభిస్తుంది.

మనరాజకీయార్థిక వైజ్ఞానిక పురోభివృద్ధికి పునాది ప్రజాతంత్ర సూత్రంపై ఆధారపడిన విశాలాంధ్ర దేశమే. ఆంధ్రదేశంలోని రచయితలూ, కళాకారులూ ఈ విశాలాంధ్ర సంస్కృతీ నిర్మాణాన్ని తమ విధ్యుక్త ధర్మంగా కొనసాగిస్తారు

* * *

# విజ్ఞప్తి

అభ్యుదయ విశాలాంధ్ర వైజ్ఞానికసంచికను అక్టోబరు 10వ తేదీకే ప్రచురిస్తామని చెప్పి అలా చేయలేక అనేకమంది అభిమానులకూ, పాఠకులకూ ఆశాభంగం కలిగించినందుకు విచారిస్తున్నాము. అభ్యుదయను సక్రమంగా వెలువరించ లేకపోవటానికి ప్రధానకారణం ఆర్థిక దుస్థితి. దీనికి ఎక్కువభాగం ఏజంట్లే కారకులని చెప్పాలి. ఇప్పటికీ ఏజంట్లనుంచిరావలసిన పైకం రూ.2,000 వరకూ వుంది. వ్యాపారానికి కాక, ఒకఉత్తమాశయ సాధనకోసం నడిచేపత్రికకు ఇదిఎంత దుస్సహమవుతుందో ఆలోచించండి.

కాని, ఇంతవరకూ అభ్యుదయ రచయితల సంఘానికి అన్నివిధాలా తోడ్పడుతూ వచ్చిన పెద్దల సహాయ సహకారాలతో పత్రికను నిర్విఘ్నంగా కొనసాగించటానికి కృషి చేస్తున్నాం.

ఇకనుంచీ 'అభ్యుదయ' ప్రతినెలా పదవ తేదీకి సక్రమంగా వెలువడుతుంది.

ఇంతేకాక, అభ్యుదయ రచయితల సంఘం తరఫున ప్రచురణలు కూడా ప్రారంభిస్తున్నాం. 'అతడు ఆమె' 'అభ్యుదయ కథలు' (1 భా.) ముద్రణఅయి సిద్ధంగావున్నాయి. 'రక్తాక్షరాలు' ఈమాసాంతానికి వెలువడుతుంది. తర్వాత మాక్సింగోర్కీ వ్రాసిన 'క్రీచర్స్' అనే నవల ప్రచురించ బడుతుంది. ఇలావరుసగా 'అభ్యుదయ' పక్షాన ప్రచురణ శాఖనుకూడా పెంపొందింప దలచాము.

అభిమానులూ, పాఠకులూ ఈపరిస్థితిలో 'అభ్యుదయ'కు తమ శక్తికొలదీ విరాళాలుపంపి, తోడ్పడాలనిమరొకమారు ప్రార్థిస్తున్నాం. మీ అందరి ఆదరాభిమానాలకు 'అభ్యుదయ' పాత్రమవుతుందని విశ్వసిస్తున్నాం.

— సంపాదకులు

# కాంతులు - కత్తులు

## ఓం శాంతిః శాంతిః శాంతిః

శాంతికోసం ఆవేదనపడని కవీ, గాయకుడూ, చిత్రకారుడూ ఎక్కడైనా వున్నారా? ప్రపంచ సాహిత్యంనిండా శాంతిగీతాలు కన్పిస్తాయి. బాధ, సంఘర్షణ, పరస్పర వైషమ్యాలు పెచ్చు పెరిగిన కొద్దీ మానవజాతి మనుగడకే ముప్పు వస్తుందని గ్రహించిన చైతన్యవంతులు ఆయా కాలాల్లో, ఆయా సమాజాల్లో శాంతిస్థాపనకై తమ శక్తిసంపదలు ధారపోశారు. బుద్ధుడు ప్రపంచానికొక శాంతి సందేశం ఇచ్చాడు కాని అశోకు లెంతమందివుంటారు? నాటినుంచి నేటివరకూ సంగ్రామాలు జరుగుతూనే వున్నాయి. కోట్లకొలది మానవులు - గుండెలూ, కోర్కెలూ వున్న మానవులు - యుద్ధరంగాల్లో హతమైపోయారు. మనుష్యుల దురాశ, దౌర్జన్యాల ఫలితంగా పారుతున్న రక్తపుటేరులు ప్రతి మానవహృదయాన్నీ కంపింపజేస్తున్నాయి సమాజ ప్రగతికి తోడ్పడే మేధావుల నేకమంది పోలండ్‌లో మహాసభ జరిపి శాంతిస్థాపనకోసం తమ సర్వస్వం ఒడ్డి పోరాడాలని నిర్ణయించారు దేశదేశాలనుంచీ వచ్చి పాల్గొన్న విజ్ఞాన వేత్తలు, కళాకారులు ప్రపంచ ప్రజలకొక హెచ్చరిక చేస్తున్నారు "బ్రతకడంకోసం శాంతిని కాపాడండి" అని.

సంగ్రామం సంస్కృతికి శత్రువు మానవుడు తన జీవనకృషిలోని సుఖదుఖాలను సాహితీ సంస్కృతులలో "రికార్డు" చేసుకుంటాడు. తన పరిణామంలోని వివిధ దశలను అందులో చూసి గ్రహించి ఆవేశం పొందుతాడు. మరింత ధైర్యసాహసాలతో ప్రకృతిపై పోరాటానికి సిద్ధమౌతాడు. కాని, మానవులలో నిత్యమూ జరిగే దోపిడీ,దుర్మార్గాలు మానవలక్ష్యాన్నే మరిపించి, విధ్వంసానికి దారితీస్తున్నాయి ఈ జాడ్యాన్ని రూపుమాపనిదే శాంతి ఏర్పడదు.

ఐతే శాంతి అనే పదానికి అనేక అర్థాలున్నాయి. ఆయుధ వుంటే అశాంతి, లేకపోతే శాంతి అని కొందరి నిర్వచనం అదెంతవరకు నిజం?

ఆయుధం లేకపోవచ్చు కాని ఆకలి? ఆకలిగొన్న దేశాలున్నాయి, వర్గాలున్నాయి, వ్యక్తులున్నారు. వీరి శరీరాలనీ, మనస్సులనీ ఆకలి దహిస్తోంది. ఎదుటివాడు లోహంతో చేసిన ఆయుధం ఉపయోగించకపోవచ్చు. అధికారం, అజ్ఞానం కూడా బలవంతుని చేతి ఆయుధాలే.



శాంతిదూత: బాపూజీ

వీటిని భగ్నం చేయనిదే మానవజాతికి శాంతిలేదు. మన దేశంలోని మేధావులు శాంతి నిర్మాణయత్నానికి పూనుకోవడమంటే, వివిధ దేశాలమధ్య నానాటికి హెచ్చుతున్న భయసందేహాలను నిర్మూలించడమే కాదు, వేర్వేరు వర్గాలుగా చీలి దినదినమూ సంఘర్షిస్తున్న సమాజాన్ని అవగాహన చేసుకొని, సమధర్మ స్థాపనోద్యమాన్ని పెంపొందించాలి.

మన విజ్ఞానవేత్తలు, కళాకారులు ఈ కర్తవ్యాన్ని క్రమంగా గ్రహిస్తారు. కాని, యుద్ధదేవతకు బిడ్డల్ని అర్పించిన తల్లులు, కరువు రాక్షసికి ప్రాణాలర్పించిన బిడ్డలు పూర్వమే గ్రహించారు

ఆనాడు మహర్షులన్నారు. ఈనాడు మానవజాతి అంతా పదే పదే ఆలపిస్తోంది.

"ఓం శాంతిః శాంతిః శాంతిః"

# టి. యస్. ఇలియట్

"వెళ్ళిపోదాం పద
నీవూ, నేనూ!
ఆపరేషన్‌కు సిద్ధంగా రోగిని
ఆస్పత్రిలో పడుకోబెట్టినట్లు
ఆకాశంమీద సాయంత్రం
సాగిలపడ్డ సమయంలో:
వెళ్ళిపోదాం పద
నీవూ, నేనూ !"

ఈ పంక్తులు 'జె. ఆల్ఫ్రెడ్ ప్రఫ్రాక్' అనే గీతంలోవి. ఒకకొత్త భావనా చాతుర్యం, ఒకకొత్త దృక్పథం - యీ రెండింటికీ ఈ పంక్తులుదాహరణలు. ఈ గీతంతో ప్రఖ్యాతి గడించిన టి. యస్. ఇలియట్ గత ముప్ఫైఏండ్లనుంచీచేస్తున్న సాహిత్యకృషి ఫలితంగా మొన్న నోబెల్ బహుమానం లభించింది. ఐతే ఇలియట్‌కు ఈ గౌరవం కొత్తకీర్తిని తెచ్చిపెట్టను ఇంతకుముందే ఆంగ్లకవితాజగత్తులో అగ్రస్థానం పొంది, వివిధదేశాల సాహిత్యాలు, తనకిందితరం రచయితలు తన కవిత్వ రీతులను అనుసరించేలాగ ఇలియట్ ఒరవడి పెట్టాడు. ఇంతకుముందే అతన్ని అనేక సాహిత్యసంస్థలు అనేక విధాల గౌరవించాయి. సుమారు పది విశ్వవిద్యాలయా

(మిగతా 10 వ పేజీలో)



స్వాతంత్ర్య మనేదీ స్వతంత్ర జీవనమనేదీ వట్టి భావనకాదు. ఆ స్వాతంత్ర్యం దాని ఫలితాలతో ప్రత్యక్షజీవితంలో ప్రవేశించినప్పుడే మనకు స్వతంత్రజీవనం ఏర్పడుతుంది. నాజీ నిజాం ఇనుప పిడికిటినుంచి బయటపడిన విముక్త తెలంగాణాలో వ్యావసాయిక సంస్కరణలతో పాటు, వయోజన విద్యా ప్రచారం జరుగుతున్నది. అలాంటి కేంద్రాల్లోని ఒక దృశ్యం ఇది.

(8వ పేజీ తరువాయి)

లయునా ఒతనికి డాక్టర్ బిరుదాలిచ్చాయి. ఎప్పటిలాగే, నోబెల్ ప్రైజ్ కమిటీ, ఒక ప్రఖ్యాత వ్యక్తిని గౌరవించి తన పరువు నిలబెట్టుకున్నది.

థామస్ స్టెర్న్స్ ఇలియట్ 1888 లో అమెరికాలో సెంట్ లూయీ అనేచోట జన్మించాడు. ఇంగ్లండ్, పారిస్ లలో ప్రసిద్ధ విద్యాలయాల్లో విజ్ఞానం గడించాడు. తర్వాత లాయడ్స్ బాంక్ లో ఉద్యోగిగానూ "క్రైటీరియన్" అనే సాహిత్య పత్రికకు సంపాదకుడుగానూ పనిచేసి, ప్రఖ్యాత సాహిత్య ప్రచురణ సంస్థ అయిన ఫేబర్ అండ్ ఫేబర్ కంపెనీ డైరెక్టరుగా ఎన్నిక పొందాడు.

ఇలియట్ పేరువింటే, ఎజ్రాపౌండ్ జ్ఞాపకంవస్తాడు. ఇద్దరూ అమెరికా, బ్రిటన్ లనిండా తమ సాహిత్యతత్వాన్ని వ్యాపింపచెయ్యటానికి కంకణం కట్టుకున్నారు. పౌండ్ ప్రణాళికలు రాశాడు. 'cantos' అనే గీతాలద్వారా ప్రపంచ సాహిత్యంలో తనకుగల పాండిత్యాన్ని ప్రదర్శించాడు. కాని ఇలియట్ 1922లో ప్రకటించిన 'The Wasteland' ప్రఖ్యాతి గడించింది. తర్వాత ఇలియట్, తాను ఆ గీతంలో వ్రాసిన జీవితతత్వాన్ని అనేక విధాల విపులపర్చుతూ 'Ash Wednesday' మొదలైన గీతాలు, 'Murder in the Cathedral' మొదలైన నాటకాలు వ్రాశాడు.

'The Waste land' గీతాన్ని ఉత్తమోత్తమమైనదనీ, ప్రస్తుత నాగరికతా విశిష్టలక్షణాలను స్పష్టంగా ప్రతిఫలిస్తుందనీ, ఐ. ఎ. రిచర్డ్స్ మొదలైన విమర్శకులు అభినందించారు.

మానవజాతి నిర్మించుకున్న ప్రస్తుత నాగరికప-థాలో ఒక పెద్ద అఘాతం వుంది. దాన్ని ఈ గీతం వేలుపెట్టి చూపుతోంది. యుద్ధంవల్ల కలిగిన దుష్టఫలితాలనుచూసి హడలిపోయి ప్రగతిమార్గం కానరాని మానవుడు ఇలియట్. అతనికి నిజాయితీ (sincerity) వుంది. అందుకే లోపం వున్నదని ఆమోదిస్తాడు.

"హిప్పోపోటమస్ జంతువు
రాత్రివేళ నిద్రించినా, పగలు
తిండికోసం వేటాడుతుంది. కాని,
భగవంతుని లీల లెంత విచిత్ర
మైనవి! చర్చి ఎప్పుడూ నిద్ర
పోతూనే వుంటుంది. తింటూనే
వుంటుంది."

ఇలాగ ఇలియట్ చర్చిని నిందిస్తాడు. కాని, ఈ అమానుష విధానానికి మూలం ఏమిటో అతను రోగించడు దీన్ని చూసి భయభ్రాంతుడౌతాడు.

"భావనకూ బ్రతుకుకూ మధ్య
కదలికకూ కార్యానికీ మధ్య
నీడ పడుతోంది. ...

ఇదీ ఇలియట్ భయం ఈ నీడను వర్ణించటానికి పాత కవిత్వ రీతుల్ని నిర్భయంగా త్రోసిపుచ్చి, రచనా పద్ధతిలో విప్లవం తెచ్చాడు. అంతేకాదు మానవజాతిలోవున్న భయసందేహాలకు అతని గీతాలు అద్భుతమైన ప్రతిధ్వనులు

కాని, అతడు సాహసించి ముందుకు పోలేదు భయంతో వెనకడుగు వేశాడు. వెనక రాజులున్నారు, చర్చివుంది, పురాణ సాహిత్యంవుంది. వాటిని కౌగలించుకొని దేవుడిమీద భారం వేశాడు.

వెనక్కి వెళ్ళే యేకవి ఎప్పుడుఒక్కడే వెళ్ళడు. పాఠకుల నందరినీ తనతో లాక్కుపోవాలని ప్రయత్నిస్తాడు. ముందుకుపోకే వాళ్ళను అడ్డుపడతాడు. కాని, చరిత్ర శక్తి ఒక కవికంటె ఒక ప్రభుత్వంకంటె బలవత్తరమైనది నిర్దాక్షిణ్యంగా ముందుకు త్రోసుకు పోతుంది.

## పుస్తకాల మంటలు

"నాకు చలివేస్తోంది, ఎలాగ? చలి మంట వేసుకుంటే బాగుండును? బీర్వాల నిండా పుస్తకాలే గదా, మన కెలాగూ అనవసరం గదా? వీటికి ఈరాత్రికి మంట పెట్టనా?

"చలిమంటలో ఒక్కొక్క పుస్తకమే కాల్చుతోంటే ఎన్ని రంగుల మంటలు! ఎంత వెచ్చగా వుంది! మరి నిద్రపోవాలి. ఎలాగ? ఛీ! ఎక్కడ చూసినా వస్తువులే? అడ్డంకులే? వెధవ మెషిన్లూ ఇవీను. ఎవరేనా రెండు కోడిగుడ్లిస్తే ఈ పెద్ద మెషిన్ ఇచ్చిపారేస్తాను! ఉండు. వీటి పనిచూస్తాను. ఈ కేసులు, మెషిన్లు ఇవన్నీ ఇలాగ అప్పచ్చిచేసి, దానిమీద రెండు రీములకాయితాలు పరిచి పడక ఏర్పాటు చేస్తాను. అలాగ...ఊఁ... అలాగ! ఆ-ఇక హాయిగా పడుకుంటాం!

"ఆకలి! వెధవాకలి! ఇంత యాతన పెట్టకపోతే ఈ ప్రభుత్వం ఆకలిని నిషేధించరాదూ! హాయిగా జీతం గాళ్లు మిగులుతాయి కాని వాళ్లలా చెయ్యలేదు. అంచేతనే నేనుపాయం వెతుకుతాను. జీతంమాత్రం మిగలాలి, అందుకే యిక్కడున్న వేవైనా అమ్మాలి. ఊఁ ... ఆలోచిస్తున్నా... నిజంగా యిలాంటి బుద్ధి కారంఎప్పుడూవుంటే నేను రెండురోజుల్లో జీనియస్ గామారి, డిప్యూటీ డైరెక్టర్ని ఏడుచెరువుల నీళ్లు తాగించనూ! ఐనా, ఆలోచించడం కష్టం. నాలుగు జేబుల్లోను నాలుగు పొన్ను అక్షరాలు పోసుకొనిపోతే సరి...ఒక హేరాయిల్ సీసా, ఒక మఫ్లర్, ఒక పౌడరు డబ్బా ఏదో ఒకటి దొరుకుతుంది."

ఇలాగ భావించగలిగిన రాక్షసతత్వం ఎవరికుంటుంది? ఇది ఇరవయ్యో శతాబ్ది. మానవుడు ఈ అనంత విశ్వస్వరూపాన్ని గురించి శోధిస్తున్నాడు. భూమధ్య, స్థానం ఉష్ణోగ్రతనుకొలుస్తున్నాడు. సముద్రాన్నీ ఆకాశాన్నీ జయించాడు. భగవంతుడే గనుక బ్రతికివుంటే, మానవునికి తనే భయపడి పారిపోయేవాడు.

ఒక పుస్తకం ఎన్నివేలమంది వివిధ వృత్తుల మనుష్యుల కృషి ఫలితం? కాని, దాన్ని అమానుషంగా కాల్చి విజ్ఞాన ఖనిని బూడిదపాలు చెయ్యటం ఎంత నీచం!

ఆ నైచ్యాన్నీ, ఆటవికతత్వాన్నీ ప్రకటించటానికే మొదటి పేజీలలో నేను మనఃపరిశీలన చేశాను. దీనికి కథానాయకుడు: పోలీసు. అతనికి భగవంతుడు: ప్రభుత్వం, ప్రదేశం: ప్రజాశక్తి నగరం.

కాలం: సా. పూ. (సామ్యవాదానికి పూర్వం) అనాగరిక శతాబ్దం.

ఇంకా వివరాలు కావలిస్తే; చూడండి ప్రజాశక్తి మేనేజరు ప్రకటన.

## లార్డ్ డన్‌స్నే

అబ్బాయి: మా నాన్నకు బాగా చదువొచ్చు. నాకు నేర్పాడు కూడా.

అమ్మాయి: హు! చదువొస్తే ఎవడికి లెక్క. మా నాన్న సోల్జరు.

## గ్రంథాలయాల బిల్లు

ఈ మధ్యనే మద్రాసు అసెంబ్లీలో గ్రంథాలయాల బిల్లు ఆమోదించబడింది. గ్రంథాలయాల నిర్మాణానికి, అభివృద్ధికి కొన్ని ఏర్పాటులు, సౌకర్యాలు చెయ్యడమే దీని ఉద్దేశం.

అసెంబ్లీ చర్చలలో అనేకమంది సభ్యులు అత్యధిక శ్రద్ధను ప్రదర్శించారు. ప్రతి గ్రంథాలయ నిర్వహణకు ఒక కమిటీని నిర్మించటానికి, నిర్వహణలో స్థానిక సంఘాలు పూర్వంకంటె ఎక్కువ ఆసక్తి చూపటానికి అవకాశముంది.

ఒక గ్రంథాలయ ప్రయోజనం ఎవరి ఆసక్తిమీద ఆధారపడుతుంది? పాఠకులదేనా? మనదేశంలో చదువొచ్చిన వారెంతమంది? అందులో పత్రికలు చదువ నేర్చి, గ్రంథాలయాన్ని వినియోగించ నేర్చుకున్న వారెంతమంది? ప్రభుత్వ పద్ధతులు చూస్తే ఏ పౌరుడికైనా ఆశ్చర్యం వెయ్యక మానదు.

మద్రాసు ప్రభుత్వం విద్యావ్యాప్తి కోసం చేస్తున్న ప్రయత్నాలేమిటి? దేశం అజ్ఞానంలో మునిగివున్నప్పుడు, కోట్లకొలది సామాన్యప్రజలకు ఆస్తికాదుగదా, అక్షరజ్ఞానమైనా లేనప్పుడు యే ఒక ప్రజా ప్రభుత్వం తీసుకోవలసిన చర్య ఇదేనా? కాని, ప్రభుత్వానికి చదువుమీద పెట్టడానికి పెట్టుబడి లేదు. విజ్ఞానం, శాస్త్రం యంత్రోత్పత్తి తోడుతోడుగా పెంపొందిననాడే ఆంధ్రజాతి అభ్యున్నతి పొందగలుగుతుంది. కాని, యంత్రాలవల్ల నిరుద్యోగం హెచ్చుతుందనీ, కనుక యంత్రాలు పనికిరావనీ వాదించే, బోధించే ప్రధాన మంత్రి వైజ్ఞానికాభివృద్ధికేం తోడ్పడగలడు! పోలీసుల బడ్జెట్ఖర్చుల కోసం, ప్రజల పన్నును దుర్వినియోగపరచే ప్రభుత్వం విద్యావ్యాప్తికెలా ధనం మిగల్చగలదు?

గ్రంథాలయోద్ధరణ చాలదు. గ్రామజీవితం విద్యతో వికసించాలి.

## కొత్త నిర్వచనాలు

జీవితం: జీతంకోసం ప్రార్థించేది.

జీతం: జీవితాన్ని బలికోరేది.

* * *

పన్ను: పబ్లిగ్గా చెల్లించే లంచం.

లంచం: ప్రైవేటుగా కట్టేపన్ను.



— అచంచల విశ్వాసంతో

— భవిష్యత్తును

— దర్శిస్తున్న కర్షకుడు



'రాళ్లుకొట్టేవాళ్లు

★

చిత్త ప్రసాద్

'రైతు - కూలి'



గిడుతూరి సూర్యం

'మర తిరగట్లో'

★

రాంగోపాల్





# : 'కల్పన' :

## రెండు కోణాలు

శతాబ్దాలుగా వెంపొందుతూ వచ్చిన భారత నాట్యసంస్కృతిని చిత్రంతీసి ప్రసిద్ధ భారతనాట్యాచార్యుడు ఉదయశంకర్ ప్రపంచమంతటా ప్రదర్శిస్తున్నాడు. ఒక్క నాట్యాన్నో, సంగీతాన్నో, చిత్రకళనో, కవిత్వాన్నో ఆధారం చేసుకొన్న చిత్రం ఇంతవరకూ మన దేశంలో ఇదొక్కటే. భారతీయ జీవితానికీ, కళా సంస్కృతులకూ ఈ చిత్రం ఒక ప్రతిబింబం. శివతాండవంనుంచీ నిన్నా నేటి ఫ్యాక్టరీ నృత్యందాకా వచ్చిన భరత నాట్యాన్నంతటినీ ఈ చిత్రం సంపుటీకరించింది.

అయితే ఇది వివిధ నాట్యాల కేటలాగులాగా లేదు. ఇందులోని వివిధ నాట్యాలనూ సమన్వయిస్తూ ఒక అద్భుతకల్పన ప్రాణశక్తిలాగా చిత్రమంతటా ప్రసరిస్తూ వుంటుంది. అందుకే దీనిపేరు 'కల్పన'.

'కల్పన'ను ఆధారం చేసుకొని, భరత నాట్యరీతులను ప్రదర్శించటమే కాక, భరత నాట్యంలో నేటి వాస్తవిక జీవితాన్ని చిత్రించటమే కాక, వాస్తవిక జీవితానికీ మానవుడు ఊహించే భవిష్యత్తుకూ (కల్పనకూ) ఉన్న వ్యత్యాసాన్ని కూడా ఉదయశంకర్ ఈ చిత్రంలో వ్యక్తీకరించాడు. ఇదే ఇందులోని ప్రతిభ.

నికృష్టజీవితం అనుభవిస్తున్న కళాకారుడి హృదయంలో లేచిన తరంగాలు, కలలు కలలుగా, భవిష్యత్తుకోసం కాచుకున్న కోరికలుగా, అవే వివిధ నాట్య భంగిమలుగా ఎప్పుడో ఏర్పడనున్న ఒక భూతలస్వర్గాన్ని ఆరోపిస్తాయి.

కనుక కల్పనను రెండు కోణాలనుంచి చూడాలి. ఒకటి - భరతనాట్యంలో నేటి జీవిత వాస్తవికత; రెండోది - నేటి జీవితాన్ని యథాతథంగా చిత్రించటమే కాక మనమాశించే ఒక ఉజ్జ్వల భవిష్యత్తును ప్రబోధించటం.

కల్పన మొత్తం ఒక పెద్దకల. ఇందులో అనేక ఘట్టాలు చరిత్రలోవీ, జీవితంలోవీ మెరుపుల్లాగా జిగేలుమంటూ నడిచిపోతుంటాయి. చిత్రం మనోవేగంతో నడుస్తుంది.

ప్రజాసేవకుడుగా ఫ్యాక్టరీ యజమాని నటించటం చూస్తుంటే- అమిల్లూ, అక్కడి

## • చిత్ర సమీక్ష •

కార్మికుల పరిస్థితులూ, బ్రతుకుకోసం వారు చేసే పోరాటమూ అంతలో నాట్యంలో ప్రవేశిస్తాయి. ఫ్యాక్టరీ కూసేకూతతో సహా అన్ని పళ్ళచక్రాలూ నృత్యగానాలతో కదలాడుతుంటాయి. అనుక్షణం శ్రమించి, తినేందుకు తిండిలేని కార్మికులు యజమాని దౌర్జన్యాన్ని దోపిడినీ ప్రతిఘటించి నిలబడుతారు. కార్మికవర్గం మూర్తిగా చిత్రించబడిన నాయకుడి నృత్యాంగమూ అద్భుత విన్యాసంతో ఉప్పొంగిపోతూ వుంటుంది. కార్మికశక్తికి బెంబేలెత్తిన యజమాని పోలీసుబలం తెచ్చుకుంటాడు. కార్మికుల్ని నిర్బంధించిన తరువాత ఆ పోలీసు యజమానివద్ద నజరానా పుచ్చుకు సలాంకొట్టి వెళ్ళిపోతాడు. యజమాని విజయగర్వంతో చూస్తుంటాడు. కాని కార్మికశక్తి అణగిపోదు. కార్మిక బాహుబలం అజేయమై సంకెళ్ళను తెంచుకొని బయటపడుతుంది. మరి యజమాని కానరాడు. 'కల్పన'లో ఇది ఒక ఘట్టం.

రైతులు నృత్యోత్సవాలతో ట్రాక్టరును ఆహ్వానించటం మరొక ఘట్టం.

ఇవన్నీ కలలే. కోరుకుంటున్న భవిష్యత్తును గూర్చిన కలలు. భారత భూమిని స్వర్గధామం చెయ్యగల కలలు.

ఇంతేకాదు. ఇలాంటికలే మరొకటి హిమాలయాల్లో నాట్యకళా కేంద్రం ఒకటి వెలుస్తుంది. అక్కడ నృత్యోత్సవాలు రాజులూ జమీందార్లూ దొడ్డికుమ్మాన వచ్చి కూర్చుంటారు. వాళ్ళ దుష్టవాంఛల్ని కొలిచే మీటరు ఒకటి. సెక్స్ అపీలు స్థాయిదాటి, పిచ్చెక్కి, మీటరు బ్రద్దలయ్యేటంతటి ఉద్రేకంలో వున్న ఆరాజాధిరాజులకు పాపం ఎదురుగా మేలిముసుగుల్లోంచి బుర్రమీసాలు కనిపిస్తాయి.

ఈవిధంగా ఈ చిత్రంలో పతనమై పోతున్న పాలకవర్గాలనూ, మరో జగత్తు నిర్మించటానికి ముందంజవేస్తున్న ప్రజాశక్తులనూ ఉదయశంకర్ చిత్రించాడు.

నేడు కాకుంటే, రేపైనా ఆయన కల ఫలిస్తుంది!



# ప్రజాసాహిత్యం



సాహిత్యమంతా ప్రజలదే అనే వారసత్వపు వాక్కుమాట అవతలపెట్టి, మన ఆంధ్రసాహిత్యంలో ప్రజల పక్షాన, అంటే ప్రజల జీవితానుభూతుల్ని చిత్రిస్తున్న సాహిత్యాన్ని ప్రత్యేకించి పరిశీలించినప్పుడే ప్రజాసాహిత్యవాహినిని అవగాహన చేసుకోగలుగుతాం. ఏదేశపుసాహిత్యంలోగానీ ప్రధానంగా రెండు ధోరణులు కన్పిస్తాయి. ఒకటి_ఆయాకాలాల్లోని పరిపాలకుల దృక్పథాన్ని ప్రకటించేది. రెండోది పరిపాలకవర్గాలకు భిన్నమైన, చైతన్యవంతమైన తతిమ్మావర్గాల అసంతృప్తినీ ఆశయాలనూ పోరాటాలనూ వ్యక్తీకరించేది.

ఈ దృష్టిలో చూసినప్పుడు, మనం ఈనాడు చెప్పుకొనే తెలుగుసాహిత్యంలో చాలాభాగం అప్పటప్పటి ప్రభుత్వవర్గాలకు చెందిందిగా కనిపిస్తుంది. తెలుగుసాహిత్యం నన్నయభట్టుతో ప్రారంభమయినటు చెబుతున్నారు. అంటే నన్నయతోనే మన సంస్కృతీ చరిత్ర ప్రారంభమయిందన్న మాట. కాని దేశచరిత్ర తీసుకుంటే, 2,3 శతాబ్దాలనాటికే ఆంధ్రజాతి బౌద్ధధర్మానికి కళారూపం కల్పించింది. విశ్వవిఖ్యాతమైన బౌద్ధ శిల్పానికి ఆంధ్రుల శిల్పనైపుణ్యం కొత్తవన్నెలుదిద్దింది. పదకొండో శతాబ్దపు నన్నయ సాహిత్యంలో కానరాని రైతులూవాళ్ళజీవితమూ కళాఖండాలైనై.

అయితే, బౌద్ధయుగంలో వచ్చిన తెలుగు సాహిత్యమంటూ ఏమీఇప్పుడు కనిపించదు. కాని, అంతటి శిల్పం పెంపొందిన స్వర్ణయుగంలో సాహిత్యమేనా వెనుకంజ వేసేది? సామాన్యజ్ఞానంతో ఆలోచించినా బౌద్ధ సాహిత్యం ఎంతోకొంతవుండి తీరాలనిపిస్తుంది.

కాని ఇది చాలా వివాదగ్రస్తమైన విషయం. బౌద్ధయుగంనాటికి అసలు తెలుగు అనే భాష ఒకటి ప్రత్యేకం పుట్టనే లేదంటారు కొందరు. దీనికి నిదర్శనంగా ఆతర్వాతి శాసనాలు ప్రాకృతంలో వుండటం పేర్కొంటారు. ప్రాకృతంలో కన్పించే శాసనాల్లో బౌద్ధమతానికిచెందినవేవీ ఉన్నట్టు తెలేదు. ఆ ప్రాకృత శాసనాలు బౌద్ధధర్మాన్ని ప్రబోధించేవి కాకపోగా, బౌద్ధధర్మాన్ని అణచివేసి, మళ్ళీ చాతుర్వర్ణ్యాన్ని స్థాపించిన 'బ్రాహ్మణ' ప్రభువుల దానధర్మాలనూ శౌర్యస్థైర్యాలనూ వర్ణించేవి మాత్రమే. కనుక బౌద్ధయుగాన్ని గురించి అక్షరరూపంలో ఆంధ్రదేశంలో లభించేదేదీ ఇప్పుడు లేదు. నాగార్జునకొండ అమరావతి మొదలైన చోట్లలోని శిల్పసంపదకూడా ఉన్నట్టు, నిన్నా మొన్నటిదాకా ఎవ్వరికీ తెలేదు. మన తెలుగు సాహిత్యమనబడే ఏఒక్క

గ్రంథంలోగానీ వాటి ప్రసక్తే లేదు.

వాస్తవాలను గమనించి, కొంచెం ఆలోచిస్తే, బౌద్ధయుగం నాటి అన్ని కళలనూ "ఎవరో" బుద్ధిపూర్వకంగా మరుగు పరచార వేది స్పష్టపడుతుంది. నాగార్జున కొండలోని అనంతమైన అంతటిశిల్ప సంపత్తినే కాలదన్నిన ఆతర్వాతి ప్రభువులు బౌద్ధశాసనాలను ఏ పాతాళలోకానికి పంపారో ఎవరికి తెలుసు? ఇక మిగిలిన వీళ్ళ శాసనాలు రాజభాషఅయిన ప్రాకృతంలో కాక దేశభాషలో వుంటాయని నమ్మటం ఎలా? వీళ్ళ శాసనాలు ప్రాకృతంలో వున్నంతమాత్రాన అదే ఆనాటి దేశభాష కానవసరంలేదు. ఈరోజున దేశంలో కన్పించే ప్రతి సైన్‌బోర్డు ఇంగ్లీషులో వున్నప్పటికీ, ఇంగ్లీషు మన దేశభాష అని ఎవ్వరూ చెప్పరు. అలాగే, ఆనాటి శాసనాలు ప్రాకృతంలో వుండటం తెలుగు భాష అప్పటికింకా ఏర్పడలేదని చెప్పటానికి నిదర్శనం కాజాలదు. పోనీ, తెలుగులో కాకపోతే, కన్నడంలో మాత్రం బౌద్ధ సాహిత్యమూ బౌద్ధశాసనాలు ఏమాత్రం కనిపిస్తున్నాయి? కన్నడంకూడా లేదంటే తమిళంలో వున్నాయా? అదికూడా ఏర్పడలేదంటే, అప్పటికి ఇక్కడ మనుషులనే వాళ్లే వుండివుండరు.

ఆర్యజాతి ఆక్రమణక్రింద దస్యులూ శూద్రులూ అయిన ద్రావిడులు (ఆంధ్రులుసహా) ఆర్యమతంమీద విప్లవంగా వచ్చిన బౌద్ధమతానికి స్వాగతం ఇచ్చారు. ఆర్యజాతి ప్రాబల్యాన్ని త్రోసిపుచ్చి, మానవత్వాన్నీ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించిన బౌద్ధధర్మంతలదాల్చారు. బౌద్ధమతంమీద ప్రజలుచూపిన ప్రేమాదరాలే ఈనాడు మనకుకళలరూపంలో కనిపిస్తున్నాయి. బౌద్ధయుగంనాటికే అంతకళావైదగ్ధ్యం ప్రదర్శించిన ఆంధ్రజాతి, ఆతర్వాత, బౌద్ధమతాన్ని అణచివేసిన నిరంకుశ ప్రభుత్వాల కాలంలో _ ఏ రాజరాజ నరేంద్రుడి కాలంలోగానీ, ఏ కృష్ణదేవరాయల కాలంలో గానీ_అడుగుముందుకు పెట్టలేదు.

దీన్నిబట్టి బౌద్ధకళలు ప్రజలకు చెందినవని నిర్ధారణ చెయ్యవచ్చు. బౌద్ధ సాహిత్యమంటూ ఏదన్నావుంటే, అది ప్రజా సాహిత్యమనికూడా చెప్పవచ్చు.

అయితే ఆ సాహిత్యాన్ని తర్వాత వచ్చిన బ్రాహ్మణ ప్రభువులు నాశనం చేసారా? అని ప్రశ్నిస్తారు.

దీనికి సమాధానం ఒకటే: ఇప్పటికీ ఆర్యజాతి travel notes లాంటి వేదాలు ఆనోటా ఆన్నోటా వినిపిస్తాయి. కాని సంస్కృతంతో ఏమీ సంబంధంలేని ద్రావిడ భాషలలో ద్రావిడజాతి పురాతనానుభవాలు ఏనోటా ఎందుకు వినిపించటంలేదు? ఒక బానిస తనకు ప్రత్యేకం ఒక బ్రతుకనేది వున్నట్టుగానీ, తనకూ ఒక ఆలోచన, అనుభవం, వాటికో విలువా వున్నట్టుగానీ ఎన్నడూ అనుకోలేదు. ఆర్యజాతిదౌర్జన్యం ద్రావిడజాతిని అలాంటి బానిసలుగా చెయ్యటంలో జయించింది. అందువల్లనే ద్రావిడజాతికి శ్రుతులూ స్మృతులూ లేవు. అలాగే బౌద్ధ సాహిత్యంకూడా.

నన్నయభట్టు నాటి తెలుగుకూ ఆనాటి తదితర ద్రావిడ భాషలకూ వున్న సామ్య వైషమ్యాలు పరికిస్తే, అప్పటికేచాలశతాబ్దాలకు పూర్వం తెలుగు మూలద్రావిడంనుంచి విడిపోయివుంటుందని భాషాతత్వవేత్తలు చెబుతున్నారు మూలద్రావిడం నుంచి

విడిపోయాక తెలుగులో మొట్టమొదటి ప్రజాసాహిత్యం బొద్ధయుగానికి చెందిందే కావచ్చు.

కాని బౌద్ధయుగంతోటే ప్రజా సాహిత్యం అంతరించలేదు. ప్రజలంటూ ఉన్నంత కాలం ప్రజా సాహిత్యం వుంటుంది. ఆయా కాలాల ప్రజల జీవిత సమరాన్ని ప్రతిబింబిస్తూ, ప్రజలశక్తితో పాటు పెంపొందుతూ వుంటుంది. విడదీసి పరిపాలించాలనే ప్రభువుల రాజనీతిని ప్రతిఘటించి ప్రజలు ఎంత సంఘటితంగా నిలబడతారో అంతగానే వారి సాహిత్యంకూడా వుంటుంది. అయితే అది ప్రభువుల దృష్టిలో తప్పకుండా నిషిద్ధ సాహిత్యమే. అలాంటి సాహిత్యాన్ని వ్రాయటంగానీ, చదవటంగానీ, దాన్నిగురించి ఉన్నదన్నా చెప్పటంగానీ తప్పే.

శాంతిలేని భయానక జీవితాలు గడిపే ప్రజ,సాహిత్యప్రమాణాల దృష్ట్యా,ఈ తమ సాహిత్యాన్ని సృష్టించలేకపోవచ్చు; కాని, వారి బాధలనూ ఆవేశాల్నీ ప్రకటించే సాహిత్యాన్నయినా సృష్టించుకొంటుంది. ఈనాటికీ మనకి కనిపించే కొన్ని బుర్రకథలూ, జానపదాలూ, ద్విపద కావ్యాలూ ఈ సాహిత్యంలోకే వస్తాయి.

గొప్ప శిల్పంతో తీర్చి దిద్దిన సాహిత్యం ఖడ్గ తిక్కన పౌరుషాన్ని వర్ణిస్తే, పుల్లరి మీద తిరుగుబాటు చేసిన కాటమరాజు ధైర్యసాహసాలను కొనియాడుతూ కూనూలు బుర్రకథ ఇంటింటికీ, మనిషి మనిషికీ ఒక కొత్త సందేశం ఇచ్చింది. సర్వాయి పాపడులాగా ఎవరైనాసరే ఆనాటి ప్రభువులకు ఎదురు తిరిగితేసరి, వాళ్లనుగురించి కావలసినంత సాహిత్యం వచ్చింది. ఇలాంటి సాహిత్యం సేకరించగలిగితే ఇప్పటికీ జనపదాల్లో సంపాదించవచ్చునని నుకుంటాను. తెలంగాణా జిల్లాల్లో ప్రతిఒక్క జిల్లాలోనూ ఇంతవరకూ అచ్చు మొహం చూడకుండా ప్రచారంలోవున్న బుర్ర కథలు పది పన్నెండు కనీసం దొరుకుతాయి. అవి వచ్చినవాళ్లను వెతికి శ్రమపడి వాటిని వ్రాసుకోవాలి. ఇలాగే మన జిల్లాల్లో కూడా అనేక కథలు ప్రచారంలో వున్నాయి.

చెప్పదలచిన విషయాన్ని ప్రజానీకానికి దూరంచేసే శిల్పంకంటె, అందరికీ తెలిసే రీతినే ప్రజాకవులు స్వీకరిస్తారు. అందువల్ల, వారికి సాహిత్యప్రమాణాలు తెలియవనిగానీ, వారు వ్రాసేది సాహిత్యం కాదనిగానీ అనుకోవటం పొరపాటు. శృంగారనైషధం వ్రాసిన శ్రీనాథుడు సైతం పల్నాటి వీరచరిత్రను వ్రాసిన రీతి గమనించదగింది.

ఒకవైపున ప్రభుత్వ వర్గాల తరపున విపుల కావ్యాలూ ప్రబంధాలూ వస్తుంటే, రెండోవైపున ప్రజలపక్షాన తిరుగుబాటు పాటలు వచ్చాయి.

వీటిలో కొన్నిటినైనా సేకరించిందాకా వివరాలు చర్చించటం సాధ్యం కాదుగాని, ఈనాడు 'సాహిత్యం' గా మనకు కనిపించేది కానిది మరో సాహిత్యం వుండి వున్నదనుకోవచ్చు. ప్రభువుల సాహిత్యం ప్రభువులది; ప్రజల సాహిత్యం ప్రజలది. అంటే మన సాహిత్యం మొత్తం రెండు ప్రవాహాలుగా వచ్చింది. ఈ రెండు ప్రవాహాలూ అప్పటికీ ఇప్పటికీ నడుస్తూనే వున్న సంగతి మనకు తెలుసు.

భారతదేశంలో పతనదశలోవున్న రాజరికాలు, నిర్మాణదశలోని బ్రిటిష్ పెట్టుబడి

దారి నాగరికతేముందు, పటాపంచలై పోయినతర్వాత, దేశంలోని అన్నివర్గాలకూ విదేశీపరిపాలన కంటకమైనతర్వాత, అందరిలోనూ ఒకరకం సోదరభావం సమిష్టిఆలోచనా పెంపొంది ఐక్యభారత జాతీయతకు పునాదులేర్పడిన తర్వాత, మళ్ళీ ప్రజావాణి గంభీరస్వరంతో సాహిత్యం వచించింది. వేదయుగంనాటి సాంస్కృతిక విప్లవంలో కళాకేతన మెత్తిన ఆంధ్రప్రజ మళ్ళీ నేటి ఈ సాంస్కృతిక విప్లవంలో ఉత్తేజితులై ముందంజవేసారు. పురాతన సంప్రదాయాలనూ, మూఢ విశ్వాసాలనూ తుత్తినియలుచేసి, ఒక స్వతంత్రజాతి అవతరణకు బీజంవేసారు. ఈ యుగాన్ని ప్రతిబింబించిన వీరేశలింగం యుగపురుషుడై ఆదర్శమూర్తిఅయినాడు.

గతంలో వెతుక్కోవలసింది అలా వుంచితే, మనకు స్పష్టంగా కన్పించేది వీరేశలింగంతో ప్రారంభమైన ప్రజా సాహిత్యం. అంతకుముందుదాకా అధికార గర్వంతో పొంగిపోతూన్న గత ప్రభుత్వవరాల సాహిత్యపీఠాలు అలవాటుచొప్పున ఈ సాహిత్యాన్ని కూడా సవాలుచేసి చూసాయి; వీరేశలింగాన్నీ, ఆయన అనుయాయుల్నీ దుయ్యబట్టిదుమ్మెత్తిపోసాయి. తాము శతాబ్దాలుగా ప్రజలకుపోసిన మత్తుమందు ఇంకా పనిచేస్తుందనే విశ్వాసంతో భారతదేశపు విశిష్ట సంప్రదాయాలపేరిట ఘోషపెట్టాయి. కాని ప్రజలు నిద్రాణులు కారు. చైతన్యంతో నిలబడ్డారు. ఒకకొత్త యుగం నిర్మించారు.

వీరేశలింగంతర్వాత — 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్!'' అన్న గురజాడ మహాకవి గొంతులో ఆంధ్రప్రజల విజయకోలాహలం వినిపించింది. అప్పటికే ప్రజాసాహిత్యాన్ని ప్రతిఘటించే శక్తులు బలహీనపడ్డాయి. ప్రజలు వ్యవహరించే భాషకూ సాహిత్యభాషకూ తేడా ఉండటం కృత్రిమమన్న గిడుగు పండితుడూ; ప్రతిపక్షుల వితండవాదాలకు సాహిత్య సృష్టిద్వారా సమాధానం చెప్పిన గురజాడ మహాకవీ ప్రజాసాహిత్యానికి రాచబాట వేశారు. వాస్తవికమైన జీవితచిత్రణ, అభ్యుదయ దృక్పథం — ఇవే ప్రజా సాహిత్యానికి ప్రధాన లక్షణాలయినాయి.

వీరేశలింగం గురజాడ మహాకవుల ఉత్తమసందేశాన్ని యువకవులు అందుకున్నారు. వారికర్తవ్యాన్ని పంచుకున్నారు.

"మీ బాధలు మీగాథలు
అవగాహన నాకవుతాయి...."

"మీ కోసం కలంపట్టి
ఆకాశపు దారులంట
హడావుడిగ వెళిపోయే
జగన్నాథరథచక్రాల్
భూమార్గం పట్టిస్తాను,
భూకంపం పుట్టిస్తాను—"

అని కవి ప్రజానీకం పక్షాన నిలబడి భుజం కాస్తున్నాడు. ప్రజల దుర్భర దాస్యాన్నీ దారిద్ర్యాన్నీ తరిమివేసి, ఈ నిరుద్ధ భారతాన్ని ఒక స్వతంత్ర నందనవనం చెయ్యటానికి కవులు తమమేధస్సంతా వినియోగించి కృషిచేస్తున్నారు. సోదరదేశాల ప్రజల స్వాతంత్ర్య పోరాటాలనుంచి అనుభవం సంపాదించుకుంటున్నారు. స్వాతంత్ర్యంకోసం పోరాడేప్రజలంతా_ఏదేశీయులైనా సరే_అంతా ఒకటేనని మన రచయితలు తెలుసుకున్నారు. దోపిడినీ దౌర్జ

న్యాన్నీ ప్రతిఘటించి, నిజమైన ప్రజా స్వామ్యాన్ని స్థాపించటానికి ప్రజలతో పాటు ముందంజవేసి పోరాడుతున్నారు.

'ఉరికొయ్యల స్వతంత్ర గానాలూ', 'ఆకలి నాలుకల' దృఢ ప్రతిజ్ఞలూ, 'జెండాలై ఎగిరే గుండెలూ' ఈనాడు నిరంకుశత్వాన్ని ఎదుర్కొని స్వాతంత్ర్య సమరం సాగిస్తున్నాయి. మన ప్రజల వాస్తవిక జీవితానికీ సాహిత్యానికీ నేడు వ్యత్యాసంలేదు.

జమీందారీ విధానాన్ని వ్యతిరేకించి రైతాంగం చేసే పోరాటాన్ని చిత్రిస్తూ సాహిత్యం 'ముందడుగు' వేసింది; నిజాం నిరంకుశత్వాన్ని తృణీకరించి, తెలంగాణా వీరభూమి 'మాభూమి' అని ఎలుగెత్తింది.

అయితే నేడుకూడా ప్రభుత్వ వర్గాలున్నాయి. వారిపక్షాన వ్రాసే కవులూ లేకపోలేదు. కాని అసంఖ్యాక ప్రజానీకం నిర్మిస్తున్న ఈ నవయుగాన్ని నిరోధించటం వాళ్ల తరంకాదు. అయినా ప్రయత్నిస్తున్నారు. ప్రజా సంస్కృతిమీద దాడి ప్రారంభించారు. నిషేధాలూ నిర్బంధాలూ కోరలు తెరచుకొని సత్యాన్ని దిగమింగటానికి భయంకరంగా ఎగబడుతున్నాయి. చింతబరికెల దగ్గిర్నించీ మరతుపాకులదాకా వీధుల్లో విహారం చేస్తున్నాయి. వర్షాకాలంలోకూడా గ్రంథాలయాల్లోమంటలు లేస్తున్నాయి. బౌద్ధ విహారాలను లంజె దిబ్బలన్న నోళ్ళు మళ్ళీ చెలరేగుతున్నాయి. వీరేశలింగం 'కాగ్రెస్ మేడ్ వీరేశలింగం' అయ్యాడు. గురజాడ సరేసరి అసలు మార్క్సిస్టు 'కమ్యూనిస్టే'. కాని చైతన్యవంతులైన ప్రజలు అజేయులు! విజయం ప్రజలది!

బౌద్ధయుగంలో శతాబ్దాలుగా మన ప్రజానీకం నిర్మించుకున్న సంస్కృతీ సాహిత్యాలు బ్రాహ్మణమత ప్రాబల్యంతో రూపురేఖలు లేకుండా పోయాయి. వీరేశలింగంతో ప్రారంభించి మనం నిర్మించుకుంటున్న కళా సంస్కృతులమీద ఇవాళ మళ్ళీ నియంతల కబంధహస్తం సోకుతున్నది.

ఆంధ్రప్రజల సంస్కృతీ సాహిత్యాలు మళ్ళీ ఒకసారి ప్రమాదంలో వున్నాయి. మృత్యువు ముఖంపెట్టి వికటాట్టహాసం చేస్తున్నది. వెలుగునుచూసి భయపడ్డచీకటి అంతిమయుద్ధానికి సిద్ధమై వస్తున్నది. ఈ సారికూడా ఆంధ్రప్రజలు తమ కళా సంస్కృతుల్ని కోల్పోతారా?

ప్రజాకవి మహాకాక్కు భవిష్యత్తు ప్రవచిస్తున్నది.

"పదండి ముందుకు, పదండి పోదాం
పదండి పోదాం పైపైకి—
పదండి పోదాం వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?
కనపడ లేదా మరో ప్రపంచపు
కణకణ మండే త్రేతాగ్ని?
ఎగిరి ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు,
తిరిగి తిరిగి సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి
సలసల కాగే చమురా, కాదిది
ఉష్ణ రక్త కాసారం,
శివసముద్రమూ నయాగరావలె
ఉరకండీ ఉరకండీ ముందుకు!

* డి ఎ. ఎ ఎస్ నారాయణరావు *

# శాస్త్రసాధన ఎందుకు ?



మనచుట్టూ ప్రకృతి ఉంది. మనం కూడా ప్రకృతిలో ఒక భాగమే. ప్రకృతిలో ఒకభాగమైన మానవునికిచుట్టూ ఉన్న ప్రకృతిని గూర్చిన చైతన్యముంది. దానినిగూర్చి తెలిసికోవాలనే జిజ్ఞాస, తెలిసికొనే శక్తీ గూడా ఉన్నాయి. ప్రకృతిగురించి మానవుడు అనేకవిధాలుగా సముపార్జించిన జ్ఞానమే శాస్త్రము. ఈజ్ఞానాన్ని అనేకశాఖలుగా విభజించవచ్చును. అవే వివిధశాస్త్రభాగాలు.

ప్రకృతిని గురించిన చైతన్యము మాత్రముండి, ప్రకృతి స్వభావాలగురించి సరియైన జ్ఞానములేనప్పుడు, మానవుడు ప్రకృతిని గురించి అనేకరకములుగా ఊహించుకొనేవాడు. అనేక పిచ్చినమ్మకాలు కలిగిఉండేవాడు. ఉదాహరణకి వాన పడుతుంటే, పైనుండి మానవాతీతుడెవడో ఆ వానను కురిపిస్తున్నాడనుకొనేవాడు. కాని వట్టి పిచ్చినమ్మకాలవల్ల మానవునికి లాభమేమీ కలుగలేదు. జీవితపోరాటంలో నెగ్గడానికి ప్రకృతి స్వభావంగురించి ఎక్కువగా తెలిసికోవడము, దానిని తనకు కావలసిన పనులు చేయడానికి వినియోగించుకోవడము అవసరమయ్యాయి. అలాగక్రమేపీఅతడు ప్రకృతిని గురించి జ్ఞానము సంపాదించవలసివచ్చింది.

కళకళకోసమే(Art for Art's sake) అని కళలవిషయంలో ఎలాగైతే ఒక వాదన ఉందో, శాస్త్రం శాస్త్రం కోసమే (Science for science's sake) అని కూడా ఒకవాదనఉంది. మానవుడికి తన చుట్టూఉన్న ప్రకృతిని గూర్చి తెలిసికోవాలనే ఒక కామరహితమైన జ్ఞానకాంక్షే శాస్త్రాభివృద్ధికి కారణమనీ, ఆ కాంక్ష తీర్పటంమీదనేశాస్త్రాభివృద్ధి ఆధారపడిఉండాలని కొందరంటూరు. మానవుడుతన చుట్టూ ఉన్నప్రకృతిని గురించి తెలిసికోవడము వట్టి జ్ఞాన కాంక్షవలన కాక, జీవితావసరాలను బట్టి జరిగిందని ఇంకొందరి అభిప్రాయం.

తొలిలో శాస్త్రాభివృద్ధిఒక్కొక్కవ్యక్తి ఒక పెద్దవిషయాన్ని కనిపెట్టడం ద్వారా జరగలేదు. అనేకమంది వ్యక్తులు తమ నిత్య జీవిత పోరాటంలో, జీవిత సౌకర్యాన్ని హెచ్చుచేసికొనే ప్రయత్నంలో కొద్దికొద్దిగా ప్రకృతిని గురించిన జ్ఞానము సంపాదించేవారు. అప్పటి శాస్త్రజ్ఞానము తుదిమొదలులేనిది. ఒకప్పుడొకడొక విషయం కనిపెట్టేడని చెప్పలేము. జీవిత పోరాటం సులభమయ్యేందుకుగాను మానవజాతి అతి క్రమేపీ ప్రకృతిని గురించిన జ్ఞానం గ్రహించింది. వ్యవసాయాన్ని గురించిన జ్ఞానం, పశుపోషణ గురించిన జ్ఞానం మొదలయినవన్నీ మొదటిలోఇలాగ క్రమేపీ వచ్చినవే.

ప్రాచీనులు ఇలాసముపార్జించిన జ్ఞానాన్ని సాధారణంగా మనం శాస్త్రజ్ఞానంగా

గుర్తించము. కాని మనము శాస్త్రంగా గుర్తించే జ్ఞానముకూడా మానవుని అవసరాలవల్లనే వృద్ధి అయింది. వ్యవసాయము చేయనేర్చుకొనిన మానవుడు అందు కనుగుణ్యంగా కాలంలో వచ్చేమార్పులు గుర్తించడం అవసరం అయింది. అలాగ నక్షత్రశాస్త్రము (Astronomy) ప్రారంభమయింది. ఇవతల తూర్పుదేశాల్లోను, అవతల పడమట దేశాల్లోనుకూడా ముందుగా నక్షత్రశాస్త్రాన్ని కొంత సాధించేరు. వ్యవసాయం బాగా వృద్ధి అవుతున్నపుడు భూమి కొలతలు, భూమిని హక్కుదారులు పంచుకోవడం మొదలగు సమస్యలు వచ్చేయి. అవే జామెట్రీ, ట్రిగనామెట్రీ మొదలగు గణితశాస్త్రభాగాలు బయలుదేరడానికి కారణమయేయి. మానవుడు వస్తూత్పత్తి ఎక్కువగాచేసి వ్యాపారాలు మొదలుపెట్టేక ఒక దేశంనుండి ఇంకోదేశం ఓడలమీద వెళ్ళడానికి చేసే ప్రయత్నంలో హైడ్రోస్టేటిక్స్, హైడ్రోడైనమిక్స్; చిన్నచిన్న యుద్ధాలు చేయడం మొదలుపెట్టేక డైనమిక్స్ మొదలగు శాస్త్రాలన్నీ వృద్ధిచెందడం మొదలుపెట్టేయి. భూమిమీద దొరికే పదార్థాలన్నీ ఏవో నాలుగయిదు మూల పదార్థాల సమ్మేళిసంపలన వచ్చేయి. వాటిలోని నిష్పత్తులు మార్చి చవకరకపు లోహాలను బంగారంలోకి మార్చడం వీలవుతుంది అనే నమ్మిక; బంగారాన్ని ఇలా సృష్టించి, ఆర్థిక పరిస్థితి బాగుచేసికొందామనే తృష్ణ రసాయనిక శాస్త్రం ఉత్పత్తికి కారణమయేయి. ఇలాగ శాస్త్రజ్ఞానం పుట్టుక మానవుని అవసరాలలోనే ఉంది. 17 వ శతాబ్దంలో శాస్త్రాభివృద్ధిని ఎక్కువగా కలుగచేసిన న్యూటును పరిశోధనలు ఆనాటి ఆర్థిక సాంఘిక పరిస్థితులకు ఎలాగ సంబంధించి ఉన్నాయో హెస్సెన్ అను మాస్కో ప్రొఫెసరు ఈ మధ్య చూపెట్టేడు.

"Knowledge is for the sake of action" అని అనాఖ్లాక తత్వవేత్త. అంటే జ్ఞానము ఆచరణలో పెట్టబడడానికే సముపార్జింపబడుతుందని అర్థము. మానవుడు ఏవిషయంగురించి జ్ఞానాన్ని సంపాదించుకొన్నా, తన అవసరాలను తీర్చుకొనే నిమిత్తం, తన దారిలో కష్టాలను తొలగించుకొనే నిమిత్తం ఆపని చేస్తాడు. ఇదే శాస్త్రవిజ్ఞానానికి కూడా అన్వయిస్తుంది. మానవుడు తన అవసరాలను తీర్చుకొనే నిమిత్తం, ప్రకృతితో తన పోరాటం విజయవంతమయేందుకుగాను, ప్రకృతిని లొంగదీసికొని ఉపయోగించుకొనే సందర్భంలో ప్రకృతి స్వభావంగురించి తెలిసికోవడం మొదలు పెట్టేడు. అదే శాస్త్రవిజ్ఞానం, వివిధ శాస్త్రాలు మానవుడి జీవితావసరాలను సమస్యలను తీర్చడానికే పుట్టినవని, వివిధ శాస్త్రాలలో అభివృద్ధిని మానవుడి నూతన సమస్యలే తెచ్చాయని అనేక దృష్టాంతరాలు చూపవచ్చును. మూడువేల సంవత్సరాలక్రింద ఈగాలి ప్రవాహాలు నీటి ప్రవాహాలు ఉన్నాయి. కాని అప్పుడు వాటిని గురించిన శాస్త్రజ్ఞానము మానవుడికిలేదు. మానవుడు నీటిమీద తరుచుప్రయాణం చేయవలసి వచ్చినప్పుడు, తుపానుల ప్రమాదంనుండి తప్పించుకోవలసిన అవసరం కలిగినప్పుడు వాటి గురించిన జ్ఞానాన్ని సంపాదించేడు. మిటియరాలజీ శాస్త్రం వృద్ధిపొందింది. అలాగే రెండువేల సంవత్సరాల క్రిందటే కొన్ని లోహా

లను భూమినుండి తియ్యడం అప్పటి మానవునికి తెలిసినా, భూగర్భశాస్త్రం, గనుల శాస్త్రం అప్పుడు వృద్ధిపొందలేదు. కాని యంత్రయుగంలో మానవునికి లోహాల వాడుక ఎక్కువయినప్పుడు, లోహాలను ఎక్కువగా సంపాదించవలసిన అవసరం కలగగానే, ఈశాస్త్రాలు విపరీతంగా వృద్ధిపొందేయి. యుద్ధకాలంలో అనేక విధములైన కొత్త సమస్యలు వచ్చినపుడు, శాస్త్రం చాలా ఎక్కువగా వృద్ధిపొందడం అందరికీ తెలిసినదే.

అయితే శాస్త్రజ్ఞానం నూటికి నూరుపాళ్ళు పూర్తిగా మానవుడి అవసరాలకనుగుణ్యంగానే వృద్ధిచెందింది, ఇతరత్రా వృద్ధిచెందలేదని అనుకోడం పొరపాటు. మొదటిలో వివిధశాస్త్రాలు మానవుడి అవసరాలవల్లనే బయలుదేరినా, కొంతవరకు వృద్ధిచెందాక, శాస్త్రాలు మానవుడిజీవితావసరాలతో సంబంధం లేకుండా, మానవుని జిజ్ఞాస తీర్చడానికికూడా వృద్ధిచెందేయని చెప్పాలి. మానవుడి తొలి అభిప్రాయాలు జ్ఞానేంద్రియములు కలుగచేసిన సంచలనంవలననే కలుగుతాయి. కాని కొంత అనుభవమును సంపాదించినాక జ్ఞానేంద్రియములతో సంబంధం లేకుండా, కొత్త ఆలోచనలు చేయగలడు. అలాగే మొట్టమొదట మానవుని భౌతిక అవసరాలే శాస్త్రోద్భవానికి దారితీసేయి. తరువాత భౌతిక అవసరాలతో సంబంధం లేకుండా జ్ఞానతృష్ణ శాస్త్రాన్ని వృద్ధిపొందించింది. Necessity is the mother and curiosity is the father of science అన్నారొకరు. అవసరాలు జ్ఞానతృష్ణ రెండూ కూడా శాస్త్రాభివృద్ధికి తోడ్పడ్డాయి. కాని ఆదిలో భౌతికఅవసరాలపాలు చాలా ముఖ్యం అని మాత్రం గుర్తించాలి.

అయితే జీవితావసరాలతో సంబంధం లేకుండా జిజ్ఞాసను తీర్చడానికి మాత్రమే వృద్ధిపొందిన శాస్త్రభాగం జీవితంలో ఉపయోగంలేనిదా అంటే, లేదనిచెప్పడానికి వీలులేదు. కొత్త జిజ్ఞాసగురించి మాత్రమే వృద్ధిపొందిందన్న పరమాణుశాస్త్రభాగం క్రిందటి యుద్ధంలో పరమాణుబాంబు ఉపయోగంలోకి దారితీసింది. కొద్దిరోజుల్లో పరమాణుశక్తి మానవుని జీవితసమస్యలను తీర్చడానికి ఆ విజ్ఞానమే తోడ్పడుతుందని అనుకోడానికి అవకాశాలున్నాయి. అలాగే మొదటిలో జిజ్ఞాస వలన వచ్చిన జ్ఞానమంతాకూడా కొంతకాలం జీవితానికి నిరుపయోగంగా అగపడ్డా, ఎప్పుడో ఒకప్పుడు జీవితసమస్యలలో ఉపయోగమవుతుంది. తన జీవితావసరాలనుగురించి జ్ఞానాన్ని సంపాదించడానికి కష్టపడే మానవుడు, ఇతరత్రా వచ్చిన జ్ఞానాన్నికూడా ఆచరణలో ఉపయోగించుకోడానికి సర్వదా ప్రయత్నించకమానడు' జయమందక మానడు.

కనుక శాస్త్రాన్ని కొత్తజ్ఞాన కాంక్షతోనే సాధించాలన్న అభిప్రాయమూ లేక కొత్తసాంఘికోపయోగం గురించిమాత్రమే సాధించాలన్న అభిప్రాయమూ రెండూ కూడా అర్ధనిజాలే. ఈ రెండింటినీ కలిపి సాధించడానికి ప్రయత్నించినపుడేశాస్త్రాభివృద్ధి జోరుగా జరుగుతుంది.

* సుంకర సత్యనారాయణ *

# ఆగష్టు 15!



కాలం : 1948 ఆగష్టు 15

ప్రదేశం : ఆనందపురం పంచాయితీబోర్డు ఆఫీసుముందున్న ఖాళీస్థలం

సమయం : ఉదయం 8 గంటలు.



ఆనందపురం చిన్నబస్తీ. దీనికి అర మైలుదూరంలో రైలుస్టేషనూ, దానికి సమీపంలో ధాన్యపుమిల్లూ ఉన్నాయి.

ఆ బస్తీమధ్యగా గాతిరోడ్డు పోతుంది. ఈ రోడ్డు నానుకొని పోలీసుస్టేషనూ, బస్‌స్టాండూ చిన్నచిన్న దుకాణాలూ, కాఫీహోటళ్ళూ ఉంటాయి. ఇచ్చటి అధికసంఖ్యాకుల ప్రధానమైన వృత్తి వ్యవసాయం

ఈరోడ్డుకు కొద్దిదూరంలోవున్న పంచాయితీబోర్డు ఆఫీసు చక్కగా అలంకరించి ఉంటుంది. మహానాయకుల చిత్రపటాలూ, మంత్రిశేఖరుల ఫొటోలుగోడలకు తగిలించి వుంటాయి. రేడియోకూడా వుంటుంది. ఆఫీసు ముందున్న ఖాళీస్థలం శుభ్రంగా ఊడ్చి, నీళ్లుచల్లి త్రివర్ణపతాకాలతోను, మామిడి తోరణాలతోను, అలంకరించి వుంటుంది.

ఆఫీసుముందు వేదిక, దానిమీద ఒక డ్రాయరూ, నాలుగు కుర్చీలూ, డ్రాయరు మీద తెల్లటి ఖద్దరు వస్త్రం పరచివుంటుంది. నూలుదండ, పూలదండలూ, పువ్వులూ, వెండి పళ్లెంలో దానిమీదవుంటాయి.

మిల్లుయజమాని లక్ష్మీపతి ప్రవేశం. గడ్డం మీసాలునున్నగా గొరిగించి వుంటాయి. నూతన ఖద్దరువస్త్రాలు. బిళ్ళగోచి. తొడుగుకొన్న లాల్చీ పొడుగు కాళ్ళు దిగి వుంటుంది. తలమీద తెల్లటి గాంధీటోపీ, చేతిలో వెండిపొన్ను వేసిన నల్లటికఱ్ఱ, కాళ్ళకు కాన్పూరుచెప్పులు, కళ్ళకుజోడు, చేతి గడియారం, వేళ్ళకు ఉంగరాలు, అడ్డమూ నిలువుసమానం, బొజ్జకునిషికంటె ముందు నడుస్తూఉంటుంది. వయస్సు 40. వెనుకకు విరగబడి చేతులు త్రిప్పుకుంటూ స్టేజీలోకి ప్రవేశిస్తాడు. రేడియో న్యూస్ చెప్పుతూ వుంటుంది. లక్ష్మీపతి న్యూస్ వింటూ స్టేజీలో పచార్ చేస్తూవుంటాడు.

న్యూస్ : ఆలిండియా రేడియో వార్తలు. "స్వాతంత్ర్యం వచ్చిన తరు

వాత మనం అనేక కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. ప్రపంచ పరిస్థితులు క్షణాని కొకవిధంగా మారుతున్నాయి ఏక్షణంలో ఎక్కడ ఏం జరుగుతుందో తెలియకుండావుంది - కనుక చేసే ప్రతి పని చాల జాగ్రత్తగా ఆలోచించి చేయవలసి ఉంటుంది. ఈ పరిస్థితులలో పరిశ్రమలను జాతిపరం చేస్తే ఉత్పత్తికుంటు పడుతుంది. ఉత్పత్తిని పెంచి దేశాన్ని రక్షించాలంటే, పరిశ్రమలు వ్యక్తుల స్వాధీనంలోనే వుండాలి. అందువల్ల కనీసం పదిసంవత్సరాల వరకు పరిశ్రమలు జాతిపరం చేయబడవు" అంటూ ప్రభుత్వం ఇదివరకే ప్రకటించింది. అంతేకాదు. వర్తకుల కోరికమీద కంట్రోళ్ళను తొలగించింది. వీరుదేశ పురోభివృద్ధికి తోడ్పడ తారని ఆశించింది. కాని వర్తకులు ధరలు చుక్కలంట పెంచారు. దీన్ని ప్రభుత్వం సహించదు. వార్తలు సమాప్తి.

లక్ష్మి : సహించదు. హ్హ. హ్హ. హ్హ ప్రభుత్వం. సహిం...చదు.

[గురవయ్య ప్రవేశం. లక్ష్మిపతిబాడీ గార్డు. గుండుముఖం దుబ్బుక్రాపు. మిడి గ్రుడ్లు. రాతుసిబొగ్గు నలుపు. ఇతడు ధరించిన ఖద్దరుపంచి మడిచిదోపి, సైకిల్ కట్టు కట్టాడు. హాఫ్‌షర్టు - టర్కీ టవల్ వయస్సు 30]

గుర : సహించదా? ఎవరినండీ సహించందీ?

లక్ష్మి : ఎవరకో కాదు మనల్నే.

గుర : ఏం? ఎందుకని ?

లక్ష్మి : ధరలు పెంచామట

గుర : పెంచితే వాళ్ళకేం! అందుకని మన మీదకూడా దాడి చేస్తారా ?

లక్ష్మి : అంటున్నారు కాని చేయరు

గుర : అయితే ఈ వాగుడెందుకు?

లక్ష్మి : ఈ పిచ్చిమూక కళ్ళనీళ్ళు తుడవడానికి - బజారుల్లో గొంతులు చించుకునే వాళ్ళనోటికి కళ్లెం పెట్టడానికి.

గుర : (వికటంగా నవ్వుతూ) అవున్లే, ఇదివరకు మనల్ని ఉరితీస్తామని సారకాయలు కోశారు, తీశారా ? ఇదీఅంతే!

లక్ష్మి: సరే దానికేంగాని, మన దేవయ్యగారు ఇంతవరకు రాలేదు. ఎప్పుడో ప్రొద్దునగా కారు పంపాం.

గుర: పొద్దు ఏంటి! చీకటివుండగా నే పంపించాంగా.

లక్ష్మి: ఎందువల్లనబ్బా! ఇంకా రాలేదు.

గుర: అం! రోడ్డు దరిద్రంగా వుంది. ఆగోతుల్లో ఎక్కడ ఏం జరిగిందో.

లక్ష్మి: వారిదేముందిలే, కాకపోతే ఇంకా కాసేపటికైనా వస్తారు. కనీసం అయిదారు వందలైనా ప్రజలు వస్తారనుకున్నాం. ఏరి?

గుర: పనులు తీరాలిగా దొరలకి. వస్తారు, వస్తారు.

లక్ష్మి: ఏంవస్తారో, చివరకు ఆ వెధవలు బుర్రకథ పెట్టినా ఊరంతా ఇక్కడే చచ్చేవారు. పోనీ మన కూలీలన్నా రాలేదేం ? వాళ్ళకేం రోగమొచ్చింది

గుర (వెకిలిగా నవ్వుతూ) వాళ్ళేనా అంత తక్కువ తిండి?

లక్ష్మి: మొన్న పక్కాలు విరగతన్నించినా బుద్ధిరాలేదు పశువులకి. మిల్లుమూసిందే ఇళ్ళదగ్గర హాయిగా పండుకోమని గాదు. ఈ ఉత్సవంలో పాల్గొనమని.

గుర : (వ్యంగ్యంగా) వాళ్లూ పడుకోలేదు లేండి పాపం. మొన్న తగిలిన దెబ్బలికి, కాపులు వేసుకుంటున్నారు. ఇకదిగు తారులేండి (ఇద్దరూ నవ్వుతూ వుంటారు).

[జమీందారు గోవర్ధనరావు ప్రవేశం. పొందూరు ఖాదీపంచ, సిల్కుచొక్కా, చేతికి గడియారం, వేళ్లకు ఉంగరాలు, క్రాపు, కోరమీసం, హాఫ్‌బూటు, చేతిలో బెత్తం, కళ్ళు ఎర్రగా వుంటాయి.]

గుర : (వింగులోకిచూచి) అదుగో దొర గారు!

లక్ష్మి : ఎవరూ. (అటుజూచి) ఓహో గోవర్ధనరావు గారా! నమస్కారం. దయచేయండి (షేకుహేండు ఇచ్చుకొని నవ్వుతూవెళ్ళి ఇద్దరూ కుర్చీలలో కూర్చుంటారు). తమకు ఆహ్వానం ఎప్పుడందింది?

గోవ : రాత్రే. మద్రాసు వెళదామని ప్రయాణం కట్టాను. ఇంతలో మీ ఆహ్వానం అందింది. ప్రయాణం మార్చాను.

లక్ష్మి : మద్రాసు పనులింకా పూర్తి కాలేదా మీకు?

గోవ : ఆఁ ఆఁ అయినట్లేలెండి. దాదాపు పదిసంవత్సరాలనుంచీ భూములన్నీ లని ప్రయత్నిం. కాని కొనే దిక్కు లేక పోయింది. దీంతో ఆసీదవొదిలింది.

గుర : లేకపోతేఎవడికి క్కావాలి ఆసన్యాసి పొలాలు - మానెడు జల్లితే, సోలెడు పండవ్!

లక్ష్మి : వారికేంరా. అదృష్టవంతులు ప్రభుత్వాను గ్రహంవల్ల లక్షలకులక్షలు కొట్టేస్తున్నారు.

గుర : ఆమాట నిజమే కాని, ఎన్ని జెప్పినా ఇందులో ఆ జమిందారీ దర్జారాదండీ.

లక్ష్మి : ఏం?

గుర : వెనక ఒకరైతు దొరగారి శెలవు గాకుండా రెండు తాటాకులు కొట్టుకున్నాడంట. వెంటనే దివాణానికి పిలిపించి వాడి గడ్డం మీసాలు పీకిం చారు దొరగారు. ఆ రైతు మొగం పూర్ణబ్బూరెలా వుబ్బింది. అయినా అదేమిటని దొరగారిని అడిగిన మొగాడు లేకపొయ్యాడు! ఎన్నిజెప్పినా ఆదర్జా వేరండి!

[జమీందారు ఎడమచేత్తో కుడి మీసం మెలివేస్తూ వుంటాడు]

లక్ష్మి : (నవ్వుతూ) అప్పుడు గడ్డం మీసాలు పీకిస్తే అడిగేదిక్కు లేక పోయింది. రేపు మిల్లుయజమానై తుపాకితో కాల్పించితే అడిగేదిక్కుండదు. నీమొఖం నీకేం తెలుసురా? (జమీందారు వైపు చూస్తాడు.)

గుర : ఇంతకీ, దొరగారికి పోయేదేమీ లేదంటారు?

లక్ష్మి : ఎందుకు లేదు? వుంది. వుంది.

గోవ : ఏమిటీ?

లక్ష్మి : (నవ్వుతూ) రాజాగారనే బిరుదు [ముగ్గురూ బిగ్గరగా నవ్వుతూ వుంటారు. కారు హారన్ మోతవినిపించుతుంది. గురవయ్య బయటికి వెళ్ళుతాడు. మిగతా ఇద్దరూలేచి. ముందుకు వచ్చి, అటుచూస్తూ వుంటారు. గురవయ్య తిరిగి వస్తాడు.]

లక్ష్మి : ఏంరాగురవయ్యా !! మనకారేనా! దేవయ్య గారొచ్చారా ?

గుర : లేదు అదిపోలీసులారీ. ఎక్కడికో పోతావుంది.

గోవ : ఇవ్వాళే కాస్త హడావుడి కాదూ! ఎవళ్ళరోగమో వొదిలించడానికి వెళుతూవుంది.

లక్ష్మి : (గడియారంచూస్తూ) గురవయ్యా! నీవు బస్సుకైనా వెళ్ళి, దేవయ్యగారిని తొందరగా తీసుకురారా. ఇప్పటికే చాల ఆలస్యంజరిగింది. (పర్సులోనుంచి అయిదు రూపాయల నోటు తీసి గురవయ్య కందిస్తూ) తొందరగా రావాలి.

గుర : చిత్తం (నోటు అందుకొని వెళ్ళి పోతాడు.)

[ఇంతలో పేపరబ్బాయి పత్రికతెచ్చి లక్ష్మిపతికి అందించుతాడు. అతడు పేపరు విప్పుతాడు. పెద్దక్షరాలతో జమీందార్లకు మరి రెండుకోట్లు అను శీర్షిక ఉంటుంది)

లక్ష్మి: (పేపరుమీద చిటికవేస్తూ) గోవర్ధనరావుగారూ! మీ అదృష్టం పండింది...

గోవ: మావిషయం ఏమైనా వ్రాశాడా ఏమిటి? (తానుకూడ పేపరుమీదకు వంగి చూస్తాడు)

లక్ష్మి: (చదవటంతో పాటు అక్షరాలమీద వేలు నడుపుతూ) జమీందార్లకు మరి రెండుకోట్లు, మరిరెండుకోట్లు–ఎక్కడ పోస్తారండి యీ కోట్లన్నీ !

గోవ: (చిరునవ్వుతో) తమరు కట్టించే ఆ కొత్త ఫ్యాక్టరీలో (హటాత్తుగా వేరొకశీర్షికచూచి)మా కేకాదండోయ్! ఈనాందార్లకు ఇరవైకోట్లు! ఇరవై!

లక్ష్మి: (తానుకూడ ఆ శీర్షికచూచి పేపరు డాయరుమీద పడవేస్తూ) ఈ దరిద్రులు ఎందరు ఎన్నివాగితే నేం! కుడీ, ఎడమ- మంచీ, చెడ్డా ; గుర్తెరిగిన ప్రభుత్వంగాబట్టి ఇలా చేస్తూవుంది.

గోవ: ఈ ప్రభుత్వం ప్రజలకు ఏమీ సౌకర్యాలు చేయడంలేదంటూ కొందరు వాగుతున్నారు. ఈచేసేవి సౌకర్యాలు కావూ! ప్రజలంటే ఈ పిచ్చిమూకేనా! మనం కాదూ?

లక్ష్మి : ప్రభుత్వమంటే వేరేఎక్కడవుంది. అదే మనం. మనమే; అదీ.

[భూస్వామి నారయ్య ప్రవేశం. బట్టతల, ఖద్దరు పంచ, మా మూలు చొక్కా, కండువా, తగరం కట్టిన చెప్పులూ, వయస్సు 40]

లక్ష్మి : (నారయ్యను చూచి) ఓ హో నారయ్య గారా! మీరుకూడా ఇంత ఆలస్యం చేశారేమిటి ?

నార : దెబ్బయి పనులు. ఏం చెప్పమంటారు! (జమీందారువైపు వేలుచూపి) వీరు...బంధువులా?

లక్ష్మి : ఎరగరా ఏంటి! దక్షిణ ఎస్టేటు జమీందారుగారు; మన గోవర్ధనరావు గారు

నార : (జమీందారుకు నమస్కరిస్తూ వినయంగా) క్షమించండి ఈమధ్యచత్వారం ఒకటి ప్రాప్తించింది. గుర్తించలేక పోయ్యాను.

గోవ : (నవ్వుతూ)దాని కేం లేండి(ముగ్గురూ కూర్చుంటారు)

నార : ఒకసారి సబ్ కోర్టుదగ్గర తమ దర్శనం చేసుకున్నాను.

గోవ : అవును.

నార : ఏమైందండీ ఆ వ్యవహారం ?

గోవ : (కొంచెం ఆలోచించి) ఓ హో. హైకోర్టులో వుంది.

లక్ష్మి : వ్యవహారాల దేముంది లేండి, వస్తూవుంటాయి. పోతుంటాయి ! సరేగాని నారయ్యగారూ ! మొన్న మీ గ్రామానికి కలెక్టరు వచ్చాడని విన్నాను. ఏంజరిగిందీ ?

నార : జరిగేదేముంది ? ఊళ్లోగింజ మిగలకుండా కమాండీరు చేశాడు—

లక్ష్మి : ఏ గొడవా లేకుండా సక్రమంగా ఇచ్చారూ ? రైతులేమీ పేచీ పెట్టలే?

నార : ఏంపెడతారూ. అంతకు నాల్గురోజులుముందేగా పోలీసులు మెదిలినవాడినల్లా తన్నింకి. నోరు తెరిస్తే ఏం ప్రమాదమోనని ఎవడికి వాడు చేతులు నలుపుకుంటూ వూరుకున్నాడు.

గోవ : హు ! ఇష్టం వచ్చినట్లల్లా వాగటానికి, ఇది బ్రిటిషు ప్రభుత్వం కాదు. (పేపరు తిరగ వేస్తూవుంటాడు)

లక్ష్మి : నారయ్యగారూ ! 'ఈ' ఫారమున్న ధాన్యంమీద కమాండీరు చేశాడా ?

నార : అంత మట్టుకు దక్కినాయి లేండి.

లక్ష్మి : ఇంతకూ, మీధాన్యం సంగతి ?

నార : మనధాన్యం ఎక్కడికి పోతుంది. తమదగ్గర 'ఈ' ఫారం తీసుకున్నానని కలెక్టరుగారికి మనవి చేసుకున్నాను—

లక్ష్మి : ఊఁ

నార : అయితే చూపమన్నారు. "ఫారం ఇనప్పెట్టెలో ఉంది, తాళంచెవి జేబులో వేసుకుని మావాడు బెజవాడ వెళ్ళాడు" అన్నాను. వారు నామాట నమ్మి "సరే నాలుగురోజులలో మళ్ళీ వస్తాను అప్పటికైనా జాగర్తపెట్టండి" అని శెలవిచ్చారు.

లక్ష్మి : (నవ్వుతూ) భేష్. భలే ఎత్తు వేశావయ్యా.

నార : అంటే - కలెక్టరుగారి కాఫీ, భోజనం వగైరాలు మన గృహంలో నేలెండి.

లక్ష్మి : ఆదానంతి. ఈచిక్కు వస్తుందనే నేను ముందుగా చెప్పింది 'ఫారం' దగ్గర ఉంచుకోమని -

నార : అవును, చెప్పారు; కాని నేనే...

లక్ష్మి : ఇంతకూ ఇప్పుడు ఫారం కావాలంటారు ?

నార : అంటా రేమిటి ! అసలు ఇవ్వాళే రావడం, పదిపాళ్ళు అందుకే.

లక్ష్మి : సరే, అలాగే చూద్దాం.

నార : వారంరోజులనాడే తమ దర్శనం చేసుకుందామనుకున్నా. కాని తీరి చావలే.

లక్ష్మి : ఏం? నాటు సక్రమంగాపడలేదా?

నార : మొదట పడదనే భయపడ్డాం. కాని మిగతా గ్రామాలసంగతి ఎలా వున్నా, మావూళ్లో మాత్రం నిరటి

కంటె ఈయేడే సులువుగా పూర్తి అయాయి. జీతం పెంచమన్న గాడిద కొడుకునల్లా మెత్తగా తన్నించాం. దానితో తలదిమ్మ వదిలింది. తరువాత కూలి పెంచమని అడిగిన దిక్కు లేదనుకోండి.

లక్ష్మి: భేషైనపని జేశారు. దెబ్బకుగాని దెయ్యం వదలదు. ఈమధ్య మాకూలీలు కూడ కాస్త తలవెఱ్ఱి బెట్టారు. వెంటనే స్టేషన్‌కి తెలియపర్చాను. పోలీ...

నార: (పకపక నవ్వుతూ) అయిందా ఏమిటి ఆ కాస్తపని.

గోవ: మీరు మగవాళ్ళనే కొట్టించారేమొ మేము ఆడముండల్ని కూడ తన్నించాం (అంతా నవ్వుతారు)

[రామయ్య ప్రవేశం - రైతు. నీర్కావి పంచె, తలగుడ్డ, చేతిలో ములుకర్ర, కాళ్లకు పాత చెప్పులు]

రామ: మీలో మీరు చెవులు కొరుక్కోటమేనా, ఏమైనా మీటింగు వుందా? ఎందాక కూచోమంటావ్ లచ్చింపతి గారూ!

లక్ష్మి: (టైమ్ చూస్తూ) ఇంకొక్క పది నిమిషాలు ఓపికపట్టండి, ప్రారంభిద్దాం

రామ: పదికాకపోతే ఇంకో పదినిమిషాలుంటాం - ఇంతకీ ఆయనగారేరీ? దేవయ్యగారొస్తారని టముకు వేయించారుగా-

లక్ష్మి: అవును తప్పకవస్తారు.

రామ: ఏమోనబ్బా! మీరు ఎప్పుడు మీటింగుచేసినా, పెద్దపెద్ద నాయకులొస్తారని చెప్పడం, తీరాజూస్తే ఈడబోతే తాగనీలుండదు. ఒక్కరూరారు. అట్టేమాస్తే ఇయ్యాలా అంతేనల్లేవుంది

లక్ష్మి: అబ్బే అదేమీకాదు. తెల్లవారుఝామున నగా కారుపంపే. తరవాత మళ్ళీ గురవయ్యకూడా వెళ్ళేడు - వస్తూ వుండాలి.

రామ: రాకపోతే ఇయ్యాల జనం తిట్టుకుంటూ పోతారు.

నార: ఏమంత జనమొచ్చారులే. దేవయ్యగారంతటివారు వస్తూవుంటే! ఈ జనమేనా......!

యువకుడు: (ప్రవేశించి) వారు వస్తారనబట్టే నలుగురైనా వచ్చారు.

లక్ష్మి: పనిరోజులు కాదూ! అదీ నిజమేలే నాయనా వెళ్ళికూర్చో-

రామ: కూర్చోక గంతులేస్తామంటలెండి. రెండు పాటలైనా పాడిద్దురూ.

లక్ష్మి: అలాగే ముందుకూర్చోండి-

యువ: చిత్తం.

[యువకుడు, రామయ్య వేదిక దిగి (ప్రేక్షకుల్లో కూర్చుంటారు.)

లక్ష్మి: (ప్రేక్షకుల్లోకి చూస్తూ) మాధవా! అబ్బాయ్ మాధవా!

రైతు: (ప్రేక్షకులలో నుంచి) ఇక్కడ ఉన్నాడండి.

లక్ష్మి: ఇటుపంపు నాయనా.

(మాధవరావు ప్రవేశం. వయస్సు 15,)

లక్ష్మి: ఒకపాట పాడరా అబ్బాయ్.

మాధ: (గొంతు సవరించుకొని "ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు" అనే పద్యమున్నూ - "కత్తులు లేవు ఖడ్గగద గాండివముల్ మొదలే హుళక్కి" అనే పద్యం చదువుతాడు.

[వేదికమీది ముగ్గురుప్రముఖులు పద్యాలలోని భావానికి తన్మయులై తలలు వూపుతూ వుంటారు. మాధవరావు రెండవ పద్యంలోని తుదిచరణం పాడుతూ వుండగా, బయట కారు హారన్ వినబడుతుంది దానితోపాటు "మహాత్మా గాంధీకి జై" అనే గురవయ్య అరుపుకూడ వినవస్తుంది. "దేవయ్యగారు", "దేవయ్యగారు" అంటూ ప్రేక్షకుల్లో కలకలం బయలుదేరుతుంది. మాధవరావు పాట ఆగిపోతుంది.

దేవయ్యగారు ప్రవేశం. కట్టుకున్న అంగవస్త్రం మోకాళ్ళపైకి వుంటుంది. భుజంమీద తుండు, నున్నగా గొరిగిన తలమీద పిలక, చేతిలో గాంధీజీ బొమ్మ వున్న సంచి. లావుగా, బలంగా వుంటాడు. వయస్సు 45. అతివినయంగా ప్రజలకు నమస్కరించి 'బోలో మహాత్మాగాంధీజీకీ' అంటాడు. ప్రజలు 'జై' అంటారు. లక్ష్మీపతి దేవయ్యగారి మెడలో నూలుదండ, పూలదండవేసి, సవినయంగా కుర్చీ చూపుతాడు.)

దేవ: (నిల్చునే) "సోదర, సోదరీమణులారా! సకాలానికి సభకు హాజరు కాజాలనందుకు విచారించుచున్నాను. అందుకు నన్ను క్షమించ ప్రార్థన. మార్గమధ్యమున కారుచెడినది. డ్రైవరెంత తొందరపడి బాగుజేసినను వేళకందుకోజాలనైతిమి. (గురవయ్య లక్ష్మీపతి చెవిలో యేదోచెబుతాడు.)

లక్ష్మీ: (నవ్వుతూ ప్రజలతో) అయ్యా! మా డ్రైవరుసంగతి అలావుంచండి. మనమీదవుండే వాత్సల్యంతో దేవయ్యగారు స్వయంగా కారుదిగి స్టార్టయ్యే వరకు దానిని నెట్టారట. మహానుభావులు (కరతాళధ్వనులు)

దేవ: (చిరునవ్వుతో) ఇందులో గొప్ప విశేషం ఏముందిలేండి.

[ఇంతలో ఒక యువకుడువచ్చి కుర్చీలలోవున్న నల్గురు పెద్దలకు పూలదండలు వేస్తాడు. ఫోటో తీయబడుతుంది.]

లక్ష్మీ: సోదరులారా! మన దేవయ్యగారు, జమీందారుగారు, నారయ్యగారు ఇంతవరకు ఫలహారము తీసుకోలేదు. పది నిమిషాలలో ముగించుకొని వస్తాం. అందాక ఓపికతో కూర్చుంటారని ఆశిస్తున్నాను.

దేవ: ఆఁ! ఆఁ! ఇప్పుడదేంవద్దు. ముందు మీటింగు జరగనివ్వండి.

లక్ష్మీ: (జమీందారు నారయ్యలవైపు జూచి) మేం కార్యక్రమం సాగిస్తుంటాం, తమరువెళ్ళి టిఫిన్ తీసుకొని రాండి. ఆరె గురవయ్యా! వీరిని తీసుకపద.

నార: ఆఁ, ఇప్పుడెందుకులేండి.

దేవ: ఫరవాలేదులే వెళ్ళిరాండి. వెళ్ళి రాండి.

[జమీందారు - నారయ్యగురవయ్యలు వెళ్ళిపోతారు.]

లక్ష్మీ: సోదరులారా! అధ్యక్షత వహించి ఈ మహాసభను జయప్రదంగా జరిపించమని మీ అందరి తరఫున మహాత్ములైన దేవయ్య గారిని ప్రార్థిస్తున్నాను-

దేవ: (చేతులు, డ్రాయరు మీద మోపి ముందుకు వంగబడి) అల్పజ్ఞుడనూ, అజ్ఞానినీ అయిన నన్ను మీరింతగా గౌరవించుచున్నారంటే అది మీరు

నాయందుంచిన అవ్యాజానురాగమే కాని వేరొండనుకాదు. పవిత్రమైన స్థానమలంకరించుట కేననర్హుడనైనను మిమ్ము కాదనలేను. మీ యాజ్ఞను శిరసా వహించుచున్నాను- (సభకు నమస్కరించి కూర్చుంటాడు-కరతాళ ధ్వనులు-)

[అధ్యక్షుడికి లక్ష్మీపతి ప్రోగ్రాం కరపత్రం అందిస్తాడు]

దేవ: (ఆ కాగితం అందుకుని చూస్తూ లేచి) ప్రార్థన—మధు. (మధు ప్రవేశించి దేవయ్యగారికి ప్రజలకు నమస్కరిస్తాడు. దేవయ్యగారు తన సంచిలోనుంచి ఏకు తక్లీతీసి నూలువడుకుతూ మధును పాడమని సంజ్ఞచేస్తారు)

మధు: —

రాజసమొప్ప సెన్యము, పురాతన
కాలమునాటి యిమ్మహా
రాజుల రావణాసురుల, రాజ్యర
మామణి కందకుండన
వ్యాజకృపాకటాక్షమున నాశ్రయ
మిచ్చి తరింప జేసెనో
ఆ జననాయకాగ్రసరు, నాథును.
'నాసరదారు' గొల్చెదన్

వెళ్ళిపోయావా - బాపూ,
విడచి మమ్మెల్లరను - ఎచటికో వెళ్లి॥
కులమత ద్వేషాగ్ని కీజన
బలమునాహుతి జేసి తమతమ
కలిమినిలుపు కొనంగ జూచెడి
ఖలుల కత్తికి మొదటిబలిగా వెళ్లి॥
తరతరంబుల దేశద్రోహుల
పరమ నీచుల మహారాజుల
దరియజని బేరాలు సల్పుచు
తిరుగు ప్రముఖుల ధర్మమాయనీ వెళ్లి॥
ఘాతుకుల నరికట్టి ప్రజలకు
ఊతమివ్వని మన ప్రభుత్వపు
చేతగాని తనంబె వైరుల
వాతనిను బడవైవ అండ్రీ వెళ్లి॥
నిన్ను జంపిన శక్తులేకడ
నున్న పాతాళమున దాగిన
సర్వనాశము జేసి ప్రతినను
నిర్వహించెదమయ్య బాపూ వెళ్లి॥

[మధు పాడుతున్నంత సేపూ, లక్ష్మీపతీ, జమీందారు, భూస్వామీకం గారు పడి బెదురుచూపులు చూస్తూవుంటారు దేవయ్యగారు మధ్య మధ్య వడకడం ఆపి మధువంక చూస్తూవుంటాడు-పాట పూర్తి కాగానే మధు వేదికదిగి ప్రజలలో కూర్చుంటాడు]

దేవ: (లేచి) సోదరులారా! ప్రఖ్యాత మిల్లుయజమానులు, దేశసేవాధురంధరులైన శ్రీ శ్రీ లక్ష్మీపతిగారు జండా నెగుర వేస్తారు.

లక్ష్మీ: (నవ్వుతూలేచి జండా దగ్గరకు వెళతాడు- వేదికమీద పెద్దలంతాలేచి నిల్చుంటారు. లక్ష్మీపతి జండాతాడు లాగ బోతాడు. ప్రజలలో నుంచి తుమ్మువినబడుతుంది. ఆతడు తెల్లబోయి దేవయ్యగారివంక చూస్తాడు. ప్రక్కన ఈ దృశ్యాన్ని ఎవరో ఫొటోలాగుతారు.)

దేవ: పర్వాలేదు లెండి, ఎగురవేయండి. (లక్ష్మీపతి జండా తాడు లాగుతాడు. మధ్యకు వెళ్ళేసరికి దాని తాడు ఇరుసునపడుతుంది. జండాఎటూకదలదు.)

దేవ: అలా కట్టివేయండి లక్ష్మీపతిగారూ— తరువాత సరిచేసుకోవచ్చు—

(లక్ష్మీపతి జండా తాడుగడకు కడతాడు-చప్పట్లు)

దేవ: ఎవరైన జాతీయగీతం పాడితే బాగుంటుంది.

లక్ష్మి: ఆఁ ఆఁ పాడిద్దాం. (ప్రేక్షకుల లోకి చూస్తూ) మాధవరావ్ అబ్బాయ్ మాధవరావ్!

మాధ: (వేదిక మీదకువచ్చి) నాకుజాతీయ గీతం రాదండి.

[సభలోనుంచి "మధుకు వచ్చునండీ" అను కేక వినబడుతుంది.)

లక్ష్మి: ఆఁ మధుకా—అఁమధూ

దేవ: పాడితే రమ్మనండి! (మధూ వేదిక మీదికి వస్తాడు.) అబ్బాయ్ ఏగీతం పాడతావ్ 'జనగణమన' వచ్చునా?

మధు: రాదండీ.

దేవ: 'విజయీ విశ్వతిరంగా ప్యారా'

మధు: అది హిందీ గీతమండీ.

దేవ: అయితే మరేగీతం పాడతావ్?

మధు: 'దేశమును ప్రేమించుమన్నా!'

లక్ష్మి: (కంగారుగా) అది వద్దండీ. ఆపాట మనదికాదు.

మధు: మీదని ఎవరన్నారు. అది గురజాడ అప్పారావు పంతులుగారిది. (ప్రజలలో నుండి నవ్వు)

దేవ: ఎందుకులే నాయనా! ఈగొడవ. నేనే పాడతాను. ఏదో ఒకటి. వచ్చిన కరకు. (దేవయ్యగారు విజయీ విశ్వతిరంగా ప్యారా పాడుతూ వుంటాడు. లక్ష్మీపతితోపాటు, మధూ, మాధవరావు లిద్దరూ చేతులుకట్టుకొని నిల్చుంటారు పాటపూర్తికాగానే అందరూ జండావందనం చేస్తారు. తరువాత మధూ మాధవరావులు వేదిక దిగి కూర్చుంటారు. భూస్వామీ, జమీందారు వచ్చితమస్థానాలనుఅలంకరిస్తారు)

లక్ష్మి: (డాయసువద్దకు వెళ్ళి) అధ్యక్షా! ఆర్యులారా! స్వరాజ్యంకోసం మన నాయకులు, పడరానికష్టాలు పడ్డారు. కడకుదాన్ని సంపాదించారు. ఆగోజున పూజ్యులైన దేవయ్యగారు, మనగ్రామములో అంటే ఇక్కడ ఈ జండాను ఎగురవేశారు. ఆ దినము, ఈ దినం. మళ్ళీ ఈదినంనాడు మీ కృపవల్ల ఈ జండాను ఎగురవేసే భాగ్యం నాకు లభించింది.

(జమీందారూ, భూస్వామీ చప్పట్లు కొడతారు. తరువాత లక్ష్మి కింద పెట్టి దేవయ్యగారుకూడ చప్పట్లు కొడతాడు. ఆయనతోపాటు సభికులలో కొందరు చప్పట్లు కొడతారు)

లక్ష్మి: (గొంతు సవరించుకొని) ఇది పవిత్రమైనస్వాతంత్ర్యం. ఎందువల్లనంటారా? ఒక్క రక్తపు చుక్కకూడచిందకుండా, సంపాదించ బడింది. మన...

1వ ప్రేక్షకుడు: (లేచి) అదేమిటండీ అట్లా అంటారు. స్వరాజ్యంకోసం అనేకమందియోధులు ఉరిస్థంభా లెక్కలేను - రక్తంధారపోస్తేను - అందాకా ఎందుకు, ఉప్పు సత్యాగ్రహంరోజుల్లో మొగుడ్డల కొట్టుకుందు పికెటింగు చేస్తూ వుంటేనేగా, మావాడిమీద పోలీసు లాఠీతోలించింది.

లక్ష్మి ఆఁ అవి [illegible]

(దేవయ్యగారివైపు చూస్తాడు)

దేవ: (లేచి) మహాశయులారా! దేశం కోసం మనవాళ్ళు నేరులు, ప్రాణాలు కోల్పోయిన మాట వాస్తవం. ఎవ్వరూ కాదనరు. ఎదుటివారి హృదయాన్ని కరిగించి, మార్చి, మనం స్వాతంత్ర్యం సంపాదించామని మాత్రమే ఇప్పుడు చెప్పినదాని భావం.

లక్ష్మి: అవును, అదే అదే, నావుద్దేశంకూడా.

దేవ: ఉపన్యాసంమధ్యలో వారిని ప్రశ్నలు వేయవలదని నా ప్రార్థన (లక్ష్మీపతిని జూచి) ఊఁ కానివ్వండి.

లక్ష్మి: పవిత్రమైన ఈ స్వతంత్రాన్ని రక్షించుకోవాలంటే, మనం మన నాయకులు చెప్పినప్రకారం, నడుచుకోవాలి. ఇదే మన ధర్మం. అధికోత్పత్తి చెయ్యాలంటున్నారు, మన పెద్దలు. కనుక అన్నపానీయాలు లేక పోయినాసరే, మనం ఆపని చేసితీరాలి. ఈ జండా ప్రతిష్టను కాపాడాలి. ఇంత...

2వ ప్రేక్షకు: (లేచి) దొంగ వ్యాపారం చెయ్యడం దేశద్రోహమని చెప్పారు కాదండి మన నాయకులు - నిజమే నంటారా ?

(లక్ష్మీపతి ఈ మాటలను విననట్లు కూర్చుంటాడు)

దేవ: (లేచి) ఇప్పుడు దక్షిణఎస్టేటు జమీందారుగారైన శ్రీ శ్రీ గోవర్ధనరావుగారు మాట్లాడుతారు.

గోవ: (లేచి) మహాజనులారా! నేను... ఊఁ - ఊఁ - దాదాపు పాతిక మైళ్ళు కారు ప్రయాణంచేసి అలిసినాను. తలనొప్పిగా వున్నది మాట్లాడలేకుండా వున్నాను. క్షమించవేడుకున్నాను.

దేవ: పర్వాలేదు మాట్లాడండి.

గోవ: (నమస్కరిస్తూ) క్షమించండి దేవయ్యగారు క్షమించండి (కూర్చుంటాడు)

[ప్రజలలోనుంచి చప్పట్లు—ఎవరో ఈల వేస్తారు.]

దేవ: (విసుగుగా) ఎవరది?

లక్ష్మి: ఎవరో కమ్యూనిస్టువాడు లెండి—

దేవ: (లేచి) సోదరులారా! రైతుబిడ్డ నారయ్యగారు మాట్లాడుతారు-

నార: ఎందుకులెండి తమరు మాట్లాడండి దేవయ్యగారు. మేము రోజూమాట్లాడే వాళ్లమే గా—

దేవ: అదేమిటి? మాట్లాడండి నాలుగుమాటలు.

[ప్రేక్షకులలోనుంచి కేకలు 'నారయ్యగారు మాట్లాడాలి' 'మాట్లాడాలి']

నార: (చేతులు నులుపుకుంటూ లేచి) సోదరులారా! కాలం అమూల్యమైంది. దానిని వృధా చేసుకోగూడదు కనుక నా సమయాన్నికూడా దేవయ్యగారేవిని యోగించుకోవడం బాగుంటుంది—. ఇలాంటి మహానీయులు ఎల్లప్పుడూ రారు. వీరిచ్చే అమూల్యమైన సందేశాన్ని విని మనం నేర్చుకోవలసినవెన్నో వుంటాయి. కనుక క్షమించినన్నింతట విడిచిపెట్టండి. (కూర్చుంటాడు)

దేవ: (కరతాళ ధ్వనుల మధ్యలేచి ఉపన్యాసం ప్రారంభించ బోతూ వుంటాడు. ఇంతలో మధు ఒకకుర్రవాడిని లాక్కొచ్చి దేవయ్యగార ముందునిల బెడతాడు)

దేవ ఎవరితను ?

మధు ఇంగాక ఈలవేసిన కమ్యూనిస్టు

లక్ష్మి: ఎందుకు వేశావురా, ఈల ? ఎవరువేయ మన్నారురా గాడిద! (చేయి ఎత్తుతాడు).

కుర్రవాడు : మరండీ .... మరండి.... మీ అబ్బాయిగారెయ్యమన్నారండి.

లక్ష్మి : పోవెధవ అవతలకు. (దేవయ్య గారితో) మీరు మా గురవయ్య కొడుకు లేండి (కుర్రవానితో పాటు మధూ కూడ నవ్వుతూ వెళ్ళిపోతాడు.)

దేవ : మహాజనులారా ! సాధుపుంగవుడు. భారత జననినోముల పంట, శాంతి దూత, అహింసా వ్రతధారి, హరిజ నోద్ధారకుడు, మనకల్పతరువు, మన గురువు, మనబోసినోటి తండ్రి, మన బాపూ మనలను వీడినాడు. స్వర్గ మలంకరించినాడు.

రామ : కాదండీ ! వాడెవడో ఆతండ్రిని కాల్చిచంపాడుగా.

దేవ : కాదు, కాదు, తప్పు, తప్పు. అతడు నిమిత్త మాత్రుడు. ఆమహనీయుం డొక రిచే చంపబడుటయా ! ఆదివ్య మంగళ విగ్రహుడు తన యవతారమును చాలించినాడు. భౌతిక శరీరమును త్యజించినాడు.

ఆ మహాత్ములు ప్రపంచమునకొక నూతన సందేశము నిచ్చినారు. అంతే గాదు. ఒక దివ్యఖడ్గమునుకూడ ప్రసా దించినారు. అదే, అదే, అహింసా ఖడ్గము. అది రవియస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యము నుద్రూతలూపినది. తుదకు లొంగదీసినది.

మధు అంతభయంకర శత్రువును లొంగ దీసిన దివ్యఖడ్గం చేతులోవుండగా, మనవాళ్ళు మన ప్రజలమీద హింసా ఖడ్గాన్ని ప్రయోగిస్తున్నారు. ఎందు వల్ల నండి ?

[లక్ష్మీపతి, గురవయ్యనుపిల్చి అతని చెవులో, ఏదో చెపుతాడు. గురవయ్య ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, తల పంకిస్తూ వెళ్ళిపోతాడు]

దేవ : ఎల్లప్పుడూ దాన్ని ప్రయోగించు టకు వీలుపడదు. సమయా సమయము లుండును.

రామ : ఆసమయం ఎట్లాటిదో కాస్త శెల విస్తారూ ? ఈపాపపు చెవలవింటాం.

దేవ : తాతగారూ, చక్కని ప్రశ్న యడిగి నారు. వినండి. నైజాం నరకాసుర ప్రభుత్వము తనప్రజలను దారుణముగా హింసించు చున్నది. అచ్చటి రజాకార్లు గ్రామాలను కొల్లగొట్టు చున్నారు. తెలుగుతల్లుల నవమానించు చున్నారు.

అహింసా కృత్యముల నరికట్టుటకు మహాత్ముని ప్రియశిష్యులైన భన్సాలీ గారు పూనుకొనినారు. ముష్కర నైజాము పరిపాలితగ్రామాలలో ప్రవే శించి సత్యాగ్రహము చేసినారు. కడకు నిరశనవ్రతము పూనినారు.

మధు: ఏమండీ! దేవయ్యగారూ! ఒక్క నైజాంలోనేనా, లేక అలాంటి దారుణ హింసాకాండ ఎక్కడజరిగినా, నిరశన వ్రతానికి పూనుకుంటారా?

[జమీందారు, భూస్వామి మధ్యమధ్య చెవులు కొరుక్కుంటూ వుంటారు]

దేవ: నిజమైన సత్యాగ్రహి అట్టి దారుణ హింసాకాండ లెక్కడజరిగినా సహించడు. నిరశనవ్రతము చేసితీరును.

రామ: అయితే ఇక్కడకూడ జరుగుతున్నయ్ గా. కొట్టటాలూ, చెరచటాలూ...

మధు: జరుగుతూవుంటే చూస్తూ వూరుకుంటారా దేవయ్యగారు! అలా ఎప్పటికీ జరగదు రామయ్యతాత! కొద్ది రోజుల్లో తప్పకుండా నిరశనవ్రతానికి పూనుకుంటారు.

దేవ: పొరపాటు. ఇక్కడట్టి పనిచేయ పూనుకొనరాదు. పూనుకొనము.

రామ: అదేమిటండి! అట్లా మాట్లాడతారు మీబోటి పెద్దలకుకూడ రెండునాలికలా!

[ఇంతలో ప్రేక్షకులలోనున్న మధు, రామయ్యగార్ల సమీపానికి ఇద్దరు పోలీసులు చేరుకుంటారు]

దేవ: (విసుగ్గా) సోదరులారా! నేను మరియొక మహాసభకు హాజరు కావలసియున్నది. కాబట్టి మీ ప్రశ్నలన్నిటికి తగినసమాధానమిచ్చుటకు వ్యవధిలేదు.

(ఏకులూ, తకిలీ సంచిలో సర్దుకుంటూ) నేను ముఖ్యముగా మీకు రెండు విషయములు చెప్పదలచినాను. అందొకటి: మన జాతీయ ప్రభుత్వమును బలపర్చుట, రెండు: ఈ జెండా పరువుప్రతిష్టలను కాపాడుట. మీరీరెండు కార్యముల దీర్చెదరని యాశించుచున్నాను. (సభకునమస్కరిస్తూ) సెలవు.

[వేదిక దిగుతాడు. ఆయనను సాగనంపడానికి, లక్ష్మీపతి, భూస్వామి, జమీందారు లేస్తారు. అంతాకలసి బయటికి వెళతారు. రెండవ వైపునుంచి గురవయ్య ఇనస్పెక్టరు స్టేజీలోకి ప్రవేశిస్తారు ఇనస్పెక్టరు చేతిలో 'హంటర్' వుంటుంది. ప్రేక్షకులలోకి ప్రవేశించిన పోలీసులు మధు, రామయ్య గార్లను పట్టుకుంటారు.

పోలీసులు: నడవండయ్యా, నడవండి!

ఇనస్పెక్టరుగారు రమ్మంటున్నారు.

మధు:
రామ: } ఏం, ఎందుకు?

పోలీసులు: ఎందుకో, ఏమిటో, అక్కడ తెలుస్తుంది ముందునడవండి!

ప్రేక్షకులలోనుంచి కొందరు: వెళ్ళండయ్యా, వెళ్లండి, అదేమిటో చూద్దాం!

[పోలీసులతో పాటు ఆఇద్దరూ, తెర వెనకకు పోతూ వుంటారు—

గుర: (మధు వైపు వేలు చూపుతూ) వాడే, ఆమొనగాడే. మన లక్ష్మీపతిగారి ఫ్యాక్టరీలోని కూలీల సంఘానికి పెద్ద.

ఇన: (తలపంకిస్తూ) అసలు కూలీలు ఏరీ? ఒక్కడూ సభకురాలేదేం?

గుర: ఏమోఎటుచచ్చారోఒక్కడూరాలా.

ఇన: (రామయ్యగారిని వేలుతో చూపుతూ ఈ ముసలి పీనుగ ఎవడు?

గుర: ఈవూరే, కూటికి గుడ్డకులేని ఒక బక్క సన్నాసి; రైతు.

(ఇంతలో పోలీసులు, మధు, రామయ్య తెరవెనుకకు వస్తారు. ఇనస్పెక్టరు తాను కూడ లోనికి వెళ్ళి—)

ఇన: (బిగ్గరగా) ఈ గాడ్దెల రెక్కలు విరగ్గట్టండిరా.

[పోలీసులు వారి రెక్కలంటగడుతూ వుంటారు. స్టేజ్ లోని గురవయ్య నవ్వుతూ వుంటాడు - తెర నెమ్మదిగా జారుతుంది]

# సైనికుడి ఉత్తరం



ఇక్కడ నేను క్షేమం,
అక్కడ నువ్వు కూడా,
ముసలి అమ్మా,
పాతమంచం కోడూ,
మనచిన్న బ్బాయీ,
చెరువులో కొంగ...

ఇపుడు రాత్రి అర్థరాత్రి
నా కేం తోచదు
నాలో ఒకభయం
తెల్లని దళసరిమంచు
రాత్రి చీకటికి అంచు;
దూరంగా పక్కడేరాలో
కార్పొరల్ బూట్సుచప్పుడు
ఎవరో గడ్డిమేటినుంచి పడ్డట్టు—
నిశ్శబ్దంలో
నిద్రించిన సైనికుల గురక
చచ్చినజీవుల మొరలావుంది.
అబ్బ చలి;
నెత్తురు చల్లపడే నల్లపడేచలి
పొడుగాటి చుట్ట కాల్చినా
లింగెల్
(రూపాయి దాని పాపం ఖరీదు)
వింటెల్ గుడెల్ హత్తుకొన్నా,
దాని సారానోరు నీరుతాగినా
ఈ చలిపోదు,

పోదు నాలో భయం
మళ్లీ రేపు వుదయం
ఎడార్లూ, నదులూ, అరణ్యాలు
దాటాలి; ట్రెంచెస్‌లో
దాగాలి;
పైన ఏరోప్లేన్ చేతిలో స్టెన్ గన్
'క్రీ'యి స్తే తిరిగే
అట్టముక్క సైనికులం
మార్చ్ !
వన్, టూ, త్రీ, షూట్
డెడ్ !
ఎవడ్ !
నువ్వా నేనా !
కేబుల్ గ్రామ్ యిప్పించండి
కేరాఫ్ సో అండ్ సో
మీవాడు డెడ్ !
స్పృహతప్పిన ఎనేస్తేషియాలో

వెన్నెముక కర్రలా బిగిసింది.
యుద్ధం, యుద్ధం,
లిబియాలో, బెర్లిన్‌లో,
స్టాలిన్‌గ్రాడ్‌లో
స్వార్థం పిచ్చికుక్కలా పరుగెత్తింది
అబ్బ; వణకించే చలి.
అందరూ నిద్రపోతున్నారు
అందరూ చచ్చిపోతున్నారు.
అర్ధరాత్రి దాటిందని మ్రోగిన
ఒంటిగంట
మంటలా మొహాన్ని కొట్టింది
నేను ఇదివరకటి నేనుకాను,
నాకు విలువలులేవు
నాకను భూతుల్లేవు
చంపడం, చావడం,
మిాసం దువ్వడంలాంటి
అలవాటయింది.
కనిపించే యీ
యూనిఫారమ్ కింద
ఒక పెద్ద నిరాశ ఒక అనాగరికత
బ్రిడ్జికింద నదిలాగ
రహస్యంగాఉంది.
వదలలేని మోసపు ఊబిలాగవుంది
నేనంటే నాకే అసహ్యం,
అందుకే మరీమరీ చంపుతాను,
మరీమరీ తాగుతాను

ఇంకేంచేసినా ఎవరూ ఒప్పుకోరు,
ఇంక తెలవారుతోంది
దూరంగా ఆల్ప్సుమీద మంచు
దుఃఖంలా కరుగుతుంది.
ప్రభాతం
సముద్రాలలో వెండి
నౌకలాఊగుతుంది
తిరిగి ఎప్పుడు మనవూరు
వస్తానో, నిన్నుచూస్తానో,
అందమైన తెల్లని నవ్వు నీ మెడలో
గొలుసు గొలుసులుగా
కదలినపుడు అదో విధమైన
చెమ్మగలిగిన నీచూపు...
నెమలిరెక్కలా విప్పుకొన్నపుడు
ఎన్నాళ్ళకి, ఎన్నాళ్ళకి!
కొన్నివేల మైళ్ళదూరం
మనమధ్య
ఒకయుగంలా అడ్డపడింది.
ఇంకసెలవు
మైడియర్,
నిద్రవస్తోంది
మత్తుగా, నల్లగా,
అడుగో సెంట్రీ.
డేరాముందు గోడలా నిలబడ్డాడు,
అదిగో
ఇంకా కార్పొరల్ బూట్సుచప్పుడు

# ప్రపంచంలో ప్రపంచం



ప్రపంచంలో ప్రపంచం కదిలింది
పేదవాళ్ల గుండెల్లో గాయం రేగింది
నకనకలాడే ఆ రకరకాల
కలికడుపుల ఐక్యపుకంఠం!
పున్నమివచ్చే రోజుకుముందర
అన్నంకోసం పెనుతుపాను
ప్రపంచమంతా చుట్టేస్తూ
ప్రచండమై వ్యాపిస్తున్నది.
మంత్రులమని ప్రజాతంత్రులమని
యంత్రాల్లా ప్రజలనుపీడించే
ధనికుల దాసుల రోజుల్లారా!
శ్రామికులను పీల్చేస్తారా?
పామరులను చంపేస్తారా?
చాతకాదుమీకు - చేవలేదునేడు.
చావలేదు ప్రజలగుండె;
శక్తిని రూపాయలు చేసికొని
విమానాల్లో విహరించే
అమానుషుల తొత్తుల్లారా?
చావలేదు ప్రజలగుండె;
చాలినంత కడుపుకట్టి
చాచిందదుగో నాల్కలు!
చావులుమీకోసం ఎలుగెత్తి
క్రొత్తశిశువులు చదువుకోని
మెత్తని చేతులు చాచినవవిగో
పైకంతో కళ్లు మూసుకుని
మైకంతో మైమరచి
పైఅంతస్తుల్లో పడుకొన్నారా?
పైకప్పెకూలిపడే రోజొస్తున్నది
నిద్రపోండి_నిద్రపోండి
భద్రంగా మరణించే రోజొస్తున్నది!

---

కడుపులోనీళ్లు కదలుతూన్నట్టు;
జాగ్రతసుమీ
జాగ్రత-నువ్వూ
పిల్లలూ, బల్లులూ_అందరూ!
మళ్లీజవాబు వ్రాయిసుమీ,
ఎన్నాళ్లకో మరి
సెలవ్,
అబ్బ చలి,
చలిగాలి గుండెలమీద
కత్తిలా తెగింది.
నీరూపం నాదేహానికి
వెచ్చగా తగిలింది.

* పరుచూరి కోటేశ్వరరావు *

# వెంకడికి తెలుసు



కోడి కూసింది. వెంకడు లేచాడు. కోడికూతకు వెంకడి జీవితం బంధించబడింది. చరిత్ర మహచక్రాలకు అమర్చబడినట్లు. అయిదు నిముషాలు వెంకడి రెక్కలు అరుగుతాయి. ఫలితం రాగిపైసా మూసపోయబడుతుంది. ఒక నిముషం మంత్రిపుంగవుని చొక్కా పంకాకింద రెపరెపలాడుతుంది. పది రూపాయల నోటు అచ్చవుతుంది.

వెంకడు ముఖం కడుక్కోడు. పెళ్ళాన్ని పలకరించడు. పెళ్ళాం కడుపులో అతుక్కుపడుకొన్న బిడ్డని ముద్దాడడు. సరాసరి యజమాని పొలానికి పరుగెత్తుతాడు. ఢిల్లీలో ఎగిరిన విమానం మద్రాసులో వాలినట్లు. అప్పటికి తన యజమాని ప్రియురాలితో దుప్పటి తన్నివుంటాడు. సుఖనిద్రకోసం దొర్లాడుతూ వుంటాడు.

చలి ఆరోజుని మెలిపెడుతుంది. వెంకడి శరీరం శీతోష్ణాన్ని చదువుకోదు. రాయి ప్రాణవాయువును పంచుకోనట్లు. వెంకడి వంటికి బట్టలుండవు. ప్రాణంలేని బట్టలకు కూడ వెంకడు అస్పృశ్యుడే. వెంకడికున్న బట్టల్లా గాంధిగారి గోచి. చుట్టూవున్న గాలి. చలి.

నడుం వంచుతాడు వెంకడు. బురదలో చలిలో, చీకటిలో. ఒక్కడే రెక్కలాడిస్తూ వుంటాడు. చెట్లు వాటి ఆకులను కదిపినట్లు. గాలిలేకపోతే చెట్ల ఆకుల కన్నా విశ్రాంతి దొరుకుతుంది. కాని, వెంకడి రెక్కలు మిల్లులో కదిలే మరల లాంటివి నూరు ఆరు కాని - నూరు ఎప్పుడూ ఆరు కానే కాదు - వెంకడి రెక్కలు రాత్రి ఎనిమిది గంటలకే నేల వాలేది.

ఎలెక్షన్‌కు నిలబడ్డ వ్యక్తి డబ్బు ఎందుకు తగలేస్తున్నాడో తెలుసు. కొత్తగా కాంగ్రెసుభక్తులుగా కొందరెందుకు మారుతున్నారో, అది అద్దంలో ప్రతిబింబం లాంటిది. ఇవన్నీ వాళ్ళు పుస్తకాల్లో చదువుకున్నారు. కనుక వాళ్ళ బుర్రలు అంతస్థుపై అంతస్థును కట్టగలరు. వెంకడు వాడి రెక్కలను ఎండుపుల్లలను విరిచినట్టు విరుచుతాడు. కాని యెందుకో తెలియదు. వీధిబడిలో చదువుకొంటే తెలిసేదేమో? అందుకే వాడికి జ్ఞానము లేదంటారు, ఎందువల్ల? ఏమో? వాడి బుర్రలోనూ ప్రధాని నెహ్రూ తలలోనూ ఒకేరకమైన పదార్థం. కాని వీడు నెహ్రూలాగా మేఘాలకు సామ్యవాదం వప్పజెప్ప లేడు, అని వాడి నుదుటున లిఖించింది సమాజం. వెంకడి బుర్రను మట్టిలా నింపారు

• చిన్నకథ •

చేశారు. నెహ్రూ తలకు మెరుగులు దిద్దుతున్నారు.

శవాన్ని తగలేసే కట్టెలు మినుమును కరిగించలేవు. సిగరెట్టును ముట్టించే అగ్గిపుల్లకు మైనం కరుగుతుంది. వెంకడిదేహం ఎండకు వేడెక్కదు. వెంకడి యజమాని శరీరం సుకుమారం. కనుక నాలుగుగోడల మధ్య భద్రపరచబడివుంది. లాంతరు గ్లాసులో దీపంలాగ, ఒక గంట వెంకడు శ్రమిస్తే "జీవిత" బ్యాంకులో వాడి పేర ఒక సంవత్సరం ఖర్చు రాయబడుతుంది. వాడి యజమానిపేర జమ కట్టబడుతుంది. ఆవిధంగా గుమాస్తా "బాలెన్సు షీటు" తయారు చేస్తాడు.

వెంకడి బుర్ర వట్టి మట్టిబుర్ర అంటారు యజమాని బండితోలే వాడు ఎద్దులను తిట్టినట్లు. నిజంగానే వెంకడు ఏమీ ఆలోచించలేడు. వాడియజమాని గంటల తరబడి గట్టుపై కూర్చొని ఆలోచించగలడు. పరుపుపై దొర్లే భార్యచీర నలిగిందేమో? తప్పటడుగులు వేస్తూ కొడుకు జారిపడ్డాడేమో? ఇవాళ యింటివద్ద నాలుగు కూరలా? ఐదా? ఈ విధంగా ఆలోచించగలడు యజమాని. ఇవేమీ ఆలోచించలేదు వెంకడి బుర్ర. ఆలోచించమని బుర్రకథలు హెచ్చరించాయి. ఆమోదించమని హరికథలు ఘోషించాయి.

వాడు పెద్దల సుద్దులనుండి నేర్చుకొన్నదీ, అనుభవంలో చదువుకొన్నదీ ఒకే ఒక విషయం. సూర్యుడు ఉదయించటాన్ని, అస్తమించటాన్ని నేర్చుకొన్నట్లు పదహారుగంటలుపని చెయ్యటం, పదహారు అణాలు తీసుకోవటం, అదేవాడిజీవితం. అంతకన్నా ఒక్క వాక్యమూ లేదు. వెంకడు చల్లపల్లి జమిందారులాగా గిండీ గుర్రపు పందాల్లో డబ్బు పెట్టలేదు, చల్లపల్లి జమిందారు కష్టపడలేనట్లు. చలంలాగ చిరిగిన రవికల్లోనుంచిరసాన్ని గుటకలుమింగుతూ ఆస్వాదించలేడు. అందుకేవాడి బుర్ర వట్టి మట్టిబుర్ర. అసలు ఎప్పుడూ సౌందర్యం అనేదాన్ని చూసి ఎరుగదు వాడి జీవితం.

పది గంటలకు కాకపు మెతుకులు పొలానికి మోసుకువస్తుంది వాడి పెళ్ళాం. చెట్టు నీడలో కూచుని గబగబా మింగుతాడు, వాటిని గంజితో కలిపి రైలు యింజను బొగ్గును భోంచేసినట్లు. వాడి నాలుక అందరి నాలుకల్లాగా అన్ని రుచులను 'క్లాసిఫై' చేయగలది. కాని అన్ని రుచులు వాడి నాలుకను వరించవు. మన కావ్యాల్లో షడ్రుచులున్నాయి. కాని 'తాతా' నోటికి పదిరుచులుపైగా తెలుసు అన్ని ప్రభుత్వాలవీ కలుపుకొని. వెంకడి నాలుకకుమాత్రం రోజూ తెలిసే రుచి ఒకటే. అప్పుల రుచి.

వెంకడు ప్రొద్దుకేసి చూస్తున్నాడు; రాష్ట్రంకోసం ఆంధ్ర నాయకులు ఢిల్లీకేసి చూస్తున్నట్లు. అయితే వెంకడు స్వేదం ఓడ్చుతూ చూస్తాడు. విమానాల్లో, రైళ్ళల్లో, మీటింగుల్లో, పత్రికల్లోంచి నాయకులు చూస్తారు.

దుబ్బు నరుకుతున్న పాము వెంకడి కాలును కాటేసింది. కాలువ నీటితో పాటు వాడి నెత్తురు పొలాన్ని తడుపుతోంది. కుంటు కుంటూ యజమాని యింటికి బయలు దేరాడు. తేలుపురాళ్లు అడుక్కోవటానికి మందుకొనుక్కోవటానికి. అప్పటికిగాదా

నీడలో మగ్గిపోయిన యజమాని శరీరం గాలి పోసుకోవటానికి షికారు బయలుదేరింది. సంగతి తెలుసుకొన్న యజమాని నోరు నిప్పులు కక్కింది. పని వదలివచ్చినందుకు మండిపడ్డాడు. వెంకడు చచ్చినా ప్రపంచానికి లోటురాదన్నాడు. వాడు చస్తే ప్రపంచానికి వచ్చేలోటేముంది నిజంగా? యజమాని యింటిలో కుక్క చస్తే మరో కుక్కను డబ్బెట్టి కొనాలి. కూలీలు డబ్బెట్టి కొనుక్కోకుండానే కొల్లలుగా దొరుకుతారు.

తిరుగుముఖం పట్టాడు వెంకడు. కుంటు కుంటూనే యింటికి చేరాడు. సూర్యుడు అస్తమిస్తాడుగా. యజమాని ఉరుములకు జడిసి వెంకడి నోరు మూసుకొంది. రిక్త హస్తాలతో తిరిగి వచ్చాడు. వెంకడయితే నోరు మూసుకున్నాడు గాని మరి కోమటికేం పట్టింది నోరుమూసుకోవటానికి. సరుకులకెళ్ళిన వాడి పెళ్లాన్ని దబాయించి దబ్బడిగాడు కోమటి. యీ ప్రపంచంలో ఏది కావాలన్నా డబ్బు కావాలి. చివరకు చావాలన్నా తగలేసేందుకు డబ్బు కావాలి. కొందరు పెద్దలు డబ్బును, జీవితాన్ని విడదీసి మాట్లాడుతారు. వాళ్ళ జీవితాలు డబ్బుల సంచుల్లో హాయిగా నిద్రపోతున్న సమయంలోనే. యింతకీ వెంకడికి యివ్వాళ డొక్కాడదు. రెక్కాడితే డొక్కాడుతుందంటారు. వెంకడికి రెక్కాడినా డొక్కాడటంలేదు. ఎందుచేత? ఆవిధంగా వాడి నుదుట రాసిపెట్టబడింది యజమాని చేత.

ఆరాత్రి వెంకడు బాధపడుతున్నాడు. బాధను 'రికార్డు' చేస్తాయి వాడి నాడులు. కాని బాధ ఎందుకువచ్చిందో వాడిబుర్ర 'డయాగ్నయిజ్' చేయలేదు. కష్టపడ్డా కూడు ఎందుకులేదో వాడికి తెలియదు. తాను పనిచేస్తేనేగాని బ్రతకలేనని మాత్రం తెలుసు. బిర్లాకు తెల్లవ్యాపారులతో రాజీపడితే లాభాలు వస్తాయని తెలుసు.

వీటిని అర్థం చేసుకోలేడు. అందుకే వాడికి బుర్రలేదంటారు. మొక్కకు నీరు కావాలి. బుర్రకు చదువుకావాలి. అదే వాడికి లోపించింది. పరిస్థితులు, భాగ్యవంతులు, పరిపాలకులు ఏంచేస్తారో వాడికి తెలియదు. బ్రతుకు దుర్భరమై, విసుగెత్తి కోపం తెచ్చుకోవటం తెలుసు. ద్వేషించటం తెలుసు.

అందుకే "మానవుణ్ణి ఆంతరంగికంగాను, బాహ్యంగాను అణచివుంచే ప్రతిదాన్ని, మానవుని శక్తి సంపదల స్వేచ్ఛాభివృద్ధిని అరికట్టే ప్రతిదాన్ని తీవ్రంగా ద్వేషించు" అన్నాడు - మాక్సిం గోర్కీ.

# శాంతి, సంస్కృతి రక్షణకోసం నడుములు బిగించండి



ప్రపంచ శాంతి స్థాపన యత్నంలో చారిత్రాత్మకమైనఅంతర్జాతీయ మేధావులమహాసభ రోక్లో పట్టణంలో (పోలండు) గత ఆగస్టు 28 వ తేదీ వరకూ జరిగింది.

ఆమహాసభలో ఆమోదించబడిన ప్రణాళిక ప్రపంచంలోని అభ్యుదయ వాదులందరి శాంతి ప్రియత్వాన్ని స్పష్టంగా వ్యక్తంచేస్తుంది.

మహాసభకు వివిధ దేశాల నుండి 500 మందికిపైగా హాజరయారు. వారిలో ప్రఖ్యాత శాస్త్రవేత్తలు, సుప్రసిద్ధ రచయితలు, కళానిధులు, ప్రముఖ విద్యావేత్తలు, శిల్పులు, గాయకులు. విద్యాధికారులు విశ్వ మేథః

## • ప్రణాళిక •

ప్రభలకు మెరుగులు దిద్దుతున్న ప్రగతి శీలురంతా – వున్నారు. ఏదో బహుకొద్దిమందిని మినహాయిస్తే, దాదాపు ప్రతినిధులంతా ఏకగ్రీవంగా యీ ప్రణాళికను ఆమోదించారు. అమెరికానుంచి వచ్చిన 32 గురిలో ఏడుగురు, బ్రిటన్‌నుండి వచ్చిన 42 గురులో నలుగురు మాత్రం ఏకాకులైనారు. ఈప్రణాళిక ఆమోదించిన తదుపరి ఒక అంతర్జాతీయ తాత్కాలిక కమిటీని మహాసభ ఎన్నుకొన్నది.

ఇందులో ఫెడయేవ్, ఫెడోస్సెవ్ (రష్యా), పాల్ రాబ్‌సన్, హావర్డుఫాస్ట్, ఆల్బర్ట్ ఖాన్ (అమెరికా), ఇరీనాజ్యూలియట్ క్యూరీ(ఫ్రాన్సు), గిరాల్ (స్పెయిన్ రిపబ్లిక్), డా. హ్యూలెట్

జాన్సన్ (కాంటర్ బరీ మతాధి కారి) మొదలగువారు ప్రాతి నిధ్యం వహించారు.

మహాసభలో పాల్గొన్న వారిలో యిూకొ స్లజాస్లావస్కీ (సోవియట్ ప్రచార శాఖాధికారి) జె. బి. యస్. హాల్డేన్, ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు పాబ్లో పికాసో, డేనిష్ రచయిత మార్టిన్ అండర్సన్ నెక్సో భారతదేశంనుంచి డా॥ముల్క్‌రాజ్ ఆనంద్ వున్నారు.

30 వేలమంది పోలిష్ పౌరులు మహాసభ ప్రతినిధులకు స్వాగత మిచ్చి సత్కరించారు. 20 వేలమం స్త్రీలుకూడా మహాసభ ప్రణాళికను జేజేధ్వనులతో ఆహ్వానించారు మహాసభలో ఆమోదించ బడిన ప్రణాళిక పూర్తిపాఠాన్ని ఈకింద పొందు పరుస్తున్నాం.

[ సం—అభ్యుదయ ]

"వైజ్ఞానిక రంగంలో- శాస్త్ర, కళారంగాలలో - కృషి చేసే మేమంతా, 45 దేశాలకు ప్రాతి నిధ్యం వహిస్తూ, పోలండ్ పట్టణమైన రోక్లో లో సమావేశమై ప్రపంచ మేధావి వర్గానికి యీపిలుపు నిస్తున్నాం మానవ జాతియొక్క విజ్ఞాన సంపత్తికి నేడు కలుగబోతున్న మహోపద్రవాన్ని గూర్చి ముందుగా హెచ్చరిస్తు న్నాం. ఫాసిస్టు నరహంతకులముఠా జరిపినఘాతుకకృత్యాలుచారిత్రక, వైజ్ఞానిక సంపదను సర్వ నాశనం చేయటం, మేధావులను వురి తీయటం, ఘోర హింసలకు గురి చేయటం, మానవత్వ సూత్రా లనే మంటగల్పటం—మనం మన కళ్ళారా చూశాం. ఇలాంటి కృత్యాలు మానవ హృదయాన్ని ఎడారిగా మారుస్తాయి. హేతు వాదాన్ని నిర్మూలిస్తాయి. అభి వృద్ధిని అరి కట్టుతాయి.

మానవుల విజ్ఞాన సంపదను సోవియట్ దేశం, బ్రిటన్, అమెరికా ప్రజలు అన్ని ప్రజాస్వామిక శక్తులు జర్మన్ ఆక్రమిత దేశాలు ప్రజలు కలిసికష్టాలను లెక్కచేయక అసమాన త్యాగాలను ప్రదర్శించి ఫాసిస్టు ముష్కర హస్తాలనుంచి రక్షించారు.

కాని ప్రపంచప్రజానీకపు ఆశయాలకు కోర్కెలకు భిన్నంగా

యూరప్‌అమెరికాల్లోనికొద్దిమంది స్వార్థపరు-ఫాసిస్టు రక్తస్పర్శకలిన వారు- ఫాసిస్టు జాత్యంహాకార సిద్ధాంతంతో మానవ జాతి ప్రగతి మార్గాన్ని అడ్డగిస్తూ ప్రతిమస్యను, పశుబలంతో పరిష్కరించాలని చూస్తూ, తద్వారా మానవత్వ సంపదనే నిర్మూలించాలని మరో సారి కుట్ర జరుపుతున్నారు.

యూరపియన్ దేశాలు విశ్వ మానవ విజ్ఞాననిధికి కూడబెట్టిన సంపదంతా నిర్మూలం కాబోతుంది. స్పెయిన్‌లో, లాటిన్ అమెరికాలో, గ్రీస్‌లో అభివృద్ధి నిరోధక శక్తులు నానాటికబలపడటమే కాక, ఫాసిజానికి పూలపాన్పులు ఏర్పరచ బడుతున్నాయి.

చైతన్య చేతనానికి భిన్నంగా, మూర్ఖత్వం మూర్తీభవిస్తూ మానవులపైన, వివిధ జాతులపైన రంగు భేదాలతో దారుణ హాత్యాకాండ జరుగుతూ వుండటమేకాక, నానాటికి పెచ్చు పెరుగుతోంది. ఫాసిజాన్ని ఎరువు తెచ్చు కొన్న కొందరు జాతి భేదం పేరుతో అనేక దేశాలలో శాస్త్ర, కళా రంగాలలో పనిచేసే మేధావులను హింసకు, అవమానాలకు గురి చేస్తున్నారు. విశ్వ మానవ కళ్యాణానికి ఉపయోగించాల్సిన నూతన శాస్త్ర పరిశోధనలను వారు తమ గుప్పెట్లో పెట్టుకొని మానవజాతి నిర్మూలనకు ఒక సాధనంగా ఉపయోగిస్తున్నారు. ఇది మహోన్నత ఆశయంతో పురోగమించే విజ్ఞానాభివృద్ధికి దుర్వినియోగపర్చటం, అపకీర్తి పాలు చేయటం తప్ప వేరు కాదు.

వీరి పాలనలో మానవ కృషి, కళలు ప్రజలను చైతన్య వంతులను చేసేందుకు, సమైక్య పర్చేందుకు కాక, మానవులలో ద్వేషం పెంచటానికి, యుద్ధాలకు సన్నద్ధమవటానికి ఉపయోగించ బడు తున్నాయి. స్వేచ్ఛాభివద్ధిలో దృఢతర నమ్మక ముంచి అభ్యుదయకర వైజ్ఞానిక విజయాలను సద్వినియోగ పరచాలి. మానవజాతి భవితవ్యాన్ని శాంతి మార్గాన అభ్యుదయ పథాన పురోగమింప చేయాలి. స్వేచ్ఛను ఏరూపంలో పరిమితం చేసినా ఖండించాలి వివిధజాతుల మధ్య

వైజ్ఞానిక సంబంధాలు సుహృద్భావంపై ఏర్పడాలి.

నూతన శాస్త్ర పరిశోధనల వల్ల లభ్యమయే మహత్తర శక్తులన్నీ మానవాభ్యుదయం కోసం వుపయోగించాలి. కాని మారణహోమంకోసం అవి వుపయోగపడే అవకాశముంది. అంటు వ్యాధులను నిర్మూలించి మానవావసరాలను తీర్చే కల్పతరువుగా వివిధ దేశాల మేధా సంపత్తిని క్రోడీకరించి వివిధ జాతుల శాస్త్ర విజ్ఞానాన్ని సమీకరించాలి. శాంతి రక్షణకోసం అభ్యుదయాన్ని అభిలషిస్తూ కృషిచేసే ఉద్యమాల స్వేచ్ఛను అరికట్టుతూ విధించిన ఆంక్షలన్నీ తొలగేటట్లు చూడాలి. పుస్తకాలనుఅచ్చొత్తించినిశ్చయంగా ప్రచారం చేసుకొనే హక్కుకోసం పోరాడాలి. శాస్త్ర పరిశోధన ఫలితాలను ఎట్టినిషేధాలు లేకుండా ప్రకటించటం, శాస్త్ర వైజ్ఞానిక విజయాలు అందరికీ అందుబాటులో వుండేటట్లు చేయడమే శాస్త్రమూ కళలూ అన్నిటి యొక్క మహదాశయం.

ప్రపంచంలోని ఏ జాతికూడా యుద్ధాన్ని అభిలషించదు పైగా వివిధ జాతులు అట్టి యుద్ధప్రయత్నాలను నిరోధించే శక్తి సామర్థ్యాలు కలిగివున్నాయి. అవి వాటి శక్తినంతా ఉపయోగించి శాంతి స్థాపనకోసం, విజ్ఞాన రక్షణకోసం నూతనంగా తలెత్తిన ఫాసిస్టు కుట్రలను ఎదుర్కొంటాయి.

ప్రపంచ మేధాసంపన్నులారా! వివిధ జాతులు, మానవ జాతి యావత్తు చరిత్రకలిసి మీపైవుంచిన మహత్తర బాధ్యతలను విస్మరించకండి. వివిధ జాతుల వైజ్ఞానిక స్వేచ్ఛాభివృద్ధిని ఎలుగెత్తి చాటండి. అన్ని జాతుల స్వాతంత్ర్యాన్ని గొంతెత్తి కోరండి.

—ఈ ప్రణాళికను చర్చించమని వివిధదేశాల మేధావులను కోరుతున్నాం.

—శాంతి రక్షణకోసం మీ మీదేశాలలో మేధావుల మహాసభలను జరపండి.

—ప్రపంచం నలు మూలలా శాంతి రక్షణకోసం ఏర్పరచండి.

—శాంతిరక్షణకోసం అంతర్జాతీయ మేధావుల మధ్య అవినాభావ సంబంధం ఏర్పడాలి

* ఆరుద్ర *

# తెలంగాణా



సంకం నా వూరు పేరు
ఇండియా నా ఇల్లు
వింటారా నా కథనం
ఈ సమస్య అమృతమథనం"
బెదరమాకు సిస్టర్
టెంపరేచర్
తియ్యమాకు డాక్టర్
ప్రిస్క్రిప్షన్
పనికిరాదు మిస్టర్
ఈ రోగం ఇంతే
ఇంతేనండీ మాస్టార్!
ఈ గొంగళీని చూసి
మేజిక్ తివాసీ అనుకున్నాం
ఎగరడం మాట అటుంచి
ఏమాత్రం కదల్నేనా కదల్దు
ఈ బొంగరం ములికీ
విరిగిపోయింది. ఇంకేం తిరుగుతుంది?
ఈ కొడికట్టిన గుడ్డిదీపం చూసి
అమరజ్యోతి అనుకొన్నాం
అల్లాఉద్దీన్ స్వర్గాలటుంచి
అంగుళం మేరయినా వెల్గదు

ఈ అద్దం కళాయి
వెలిసిపోయింది.
ఇంకేం చూపెడుతుంది?
లాభం లేదు సిస్టర్
ఈ గాయం
మానబోదు డాక్టర్
చేతులు
కడుక్కోవోయ్ మిస్టర్
పుస్తకం
మూసెయ్యండీ మాస్టార్
కోరెక్కలు విరిచికట్టి
మైదానంలో పెట్టేందుకు
బదులు
సంకెళ్ళు తీసిపారేసి
గదిలో ఒదిలి
తాళం వేసేరు
మూతిమట్టుకూ బిగించి
కన్నెతాడిప్పి
పొదుగుముందు కొదిలేరు
ఏడవమాకు సిస్టర్
నాడిఆడదు

ఆడదయ్యా డాక్టర్
దీపం వెలగదు
వెలగదయ్యా మిస్టర్
కోటా
కడుకోటె-వోయ్ యాక్టర్

ఇకమీదట ఓపెన్
సిసేమీ అన్నా
నసేమిరా తలుపులు
విడనే విడవు

ఇకమీదట శంఖంలో
పోసిన నీళ్ళు
తీర్థం ఏమాత్రం
అవనే అవవు

ఇకమీదట స్లాట్
మెషిన్ అణాకాసుల్ని
తినేసినా టిక్కెట్లు
ఇవ్వనే ఇవ్వదు.

ఇకమీదట పోలింగు
స్టేషను రాజ్యాంగానికి
చూపుడు వేలు
కానేకాదు

లాభంలేదు సిస్టర్
ఇకమీదట
లాభంలేదు డాక్టర్
లాభంలేదు

ఇకమీదట మిస్టర్
ఇకమీదట
మోక్షంలేదండీ మాస్టార్
అందుకే

ఇంకా ఎందుకు
నటిస్తావయ్యా యాక్టర్
ఇంకాఎందుకు
తీస్తావయ్యా డైరెక్టర్
ఈ మీపిక్చర్ కి
అయిందో పెద్దఫ్రాక్చర్
జ్ఞాపకం ఉంచుకోరా
డిక్టేటర్
ప్రజలే చరిత్రరచనలో
పెద్ద ఫేక్టర్
జ్ఞాపకం ఉంచుకోరా
ఈ ఛాప్టర్.
వ్రాసుకోబోతారు తమహక్కుల
చార్టర్!

బెదరమోకు సిస్టర్
ఆపరేషన్
చేద్దాంలే డాక్టర్
ప్రస్థానం
మొదలెడదాం మిస్టర్
దారిమాకు
చూపెట్టండి మాస్టార్!

* మూన్స *

# ఒక లేఖ



ప్రియమైన కోటీ,

ఏవో నాకు తెలీని భావాలు...నా ఊహాపరిధుల్ని దాటి ఇంకా ఇంకా విశాలంగా పరుచుకొని ఎక్కడికో కూడా తెలీకుండా పరిగెడుతూన్న ఆలోచనలు పుట్టుకొచ్చాక తెగి నీకీ ఉత్తరం రాయిస్తున్నాయి.

నిన్న సాయంత్రం ఎక్కడెక్కడో విశాఖబీచిలో తిరిగి తిరిగి ఇల్లు చేరుకున్నాను... దూరాన సంద్రంలోకి పొడుచుకొచ్చిన కొండలాగ ఏదో తెలీని నిరాశా... నిస్పృహాతో గదిలో అడుగు పెట్టాను. ఆంధ్రదేశం అంతా ఆవరించిన చలిమేఘాలల్లే ఆలోచనలు మెదడునంతా కలిచివేస్తున్నాయి.

నిన్న క్రిష్ణనుంచి ఉత్తరం వచ్చింది. రెండేళ్ళనుంచి ఆమెను గురించి ఆలోచించటమైనా లేదు. ఆమె ఎక్కడుంటోందో...ఏమిచేస్తోందో ..ఎలావుందో నాకేమీ తెలీదు... జీవితంలో ఎంతో దూరం కలిసి ప్రయాణంచేశాక పెద్దరైల్వే జంక్షన్‌లో విడిపోయినట్లు విడిపోయాం. మరిచిపోదామని నిశ్చయించుకొని కృతకృత్యుణ్ణయ్యాను.

వణుకుతూన్న వేళ్ళతో కవరువిప్పాను. అసలామె ఎందుకు రాసిందీ ఉత్తరం నాకు? దూరాన మెరుస్తూన్న విశాఖ సముద్రంమీద నల్లని మేఘాలు పరుచుకున్నట్లు నీలి కాగితంమీద అక్షరాలు కదులుతున్నాయి...

"...ఎంతో కాలమైంది నీకుత్తరం రాసి...నిజానికి నేనీ ఉత్తరం రాయబోతున్నప్పుడు ఇది ఎవరికి పోస్టుచేద్దామా అని ఆలోచించనేనాలేను. ఉత్తరంమీద నీ ఎడ్రసే ఎందుకు రాశానో కారణం నాకు తెలీదు..." నేనూ కొత్త అర్థాలు భావాలు వెతకటానికి అంతకన్నా ప్రయత్నించలేదు...

ఆమె ఉత్తరంలో రాసిందినన్ను గురించి కాదు...తనని గురించి అంతకన్నా కాదు.. ఆమె ఉత్తరం ఆంధ్రదేశ చరిత్ర... ప్రజాప్రభుత్వంలో ఆంధ్రసీమ అనుభవిస్తున్న సుఖసంపద... "నాలుగురోజులవుతుంది. రాత్రి చీకటిపడింది. పల్లెటూళ్లో రాత్రి. చాలా ప్రశాంతంగా వుంది. రైతుల ఇళ్ళల్లో వంట ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీధిలో అరుగుమీదకూర్చొని ఏమిటేమిటో ఆలోచిస్తున్నాను.

భాస్కరన్నయ్య ఎక్కణ్ణుంచో వచ్చి లోపలికిపోయాడు. రాత్రి తొమ్మిదవుతుంది. దూరాన ఎక్కడో పిల్లల ఏడుపు

• పల్లె గుండె •

వినిపిస్తోంది. కప్పలు అరుస్తున్నాయి పొలాల్లో. కీచురాళ్ళు అదేగోల పెడుతున్నాయి. అంతా పల్లెటూరు నిశ్శబ్దంలో మరింత నిశ్శబ్దం కలగజేసే వాతావరణం.

ఇంతలో కారురొద వినిపించింది... "లారీ...లారీ...పోలీసులు" అంటూ వూళ్ళో జనం అంతా పరిగెత్తడం మొదలెట్టారు... చిన్నపిల్లలు ఎటూ తోచక గొల్లున ఏడవటం మొదలెట్టారు...అన్నం తింటూ భాస్కరం చెయ్యి కడుక్కోకుండా బయటపడ్డాడు...

కొన్ని నెలలనుంచి వింటున్నాను పల్లెసీమలో పోలీసుల స్వైరవిహారం...అయితే మా వూరిమీద పోలీసులు వచ్చిపడటానికి పెద్ద కారణమేమీ కనిపించలేదు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే గ్రామములో పెద్ద కాంగ్రెసుపార్టీ వాళ్లు చిన్న కాంగ్రెసుపార్టీ వాళ్ళమీద కసితీర్చుకునేందుకు కమ్యూనిస్టులని నిందలుమోపారు... కమ్యూనిస్టు కావటమే మహా నేరమయి పోయిందిక్కడ...స్వతంత్ర ఆంధ్రావనిలో ...అంతక్రితం అన్నాడట చౌదరి ఎవళ్ళతోటో..."మాడంగ్రాడా మీ పని ఎంత సేపట్లో పట్టిస్తానో ... వెంకట్రామయ్యే వస్తాడుగా పోలీసులతో..."

అయినా యిప్పుడు ఆ గోలలోకి పోదల్చుకోలేదు. ఒక్క విషయంమాత్రం రాసి ముగిస్తాను.

ఇల్లు యిల్లూ గాలిస్తున్నారు పోలీసులు...మొగాళ్లెవళ్ళూ దొరకలేదు. మా యిల్లు చేరువైంది ... పక్కయింటిమీద పడ్డారు...

"ఏమయ్యాడు...?"

"తెలీదు...నాకేం తెలుస్తుంది?"

ఏం! మీటింగు వాడు తెలుసుకుందేం ...టైముకి ఎక్కడనించో ఊడిపడతాడు ...చెప్పు ఎక్కడికి వెళ్ళాడో...దౌడ పగలగొట్టించేస్తాను..." చౌదరి

"మాస్టారేమిట్రా రాస్కెల్స్" అరిచాడు ఇనస్పెక్టర్.

అంతే...శేషమ్మ వంటిమీద చింత బరికలు ... తొమ్మిది మాసాల గర్భంతో వున్న శేషమ్మ ఒళ్ళంతా చితికిపోయింది. కదలలేదు శేషమ్మ...ఏదో తెలీని ఆవేశంలో...ఎందుకో తెలీని ఉద్రేకంతో... కదలలేదు...కడుపులో నొప్పులారంభమయ్యాయి .... కళ్ళు మైకం కమ్ముకొన్నాయి.

"మూడోసారి అడుగుతున్నాను ... చెప్పవా..."

మూడుసార్లు కాదు...మూడు వందల సార్లు అడిగినా శేషమ్మకు వినిపిస్తేనా! లేచి నిలబడటానికి ప్రయత్నించింది... ఎవడో...లాఠీలతో కడుపులో పొడిచాడు...పవిత్ర మాతృదేవిని...జీవితంలో ఎన్నో ఆశల...కలల ఫలితాన్ని...ఏ దౌర్భాగ్య తల్లి కన్న కుమ్రుడో...పొడిచాడు.

కూలిపోయిందామె...చితికిపోయి... నరనరమూ పట్టు తప్పి బంతిలా నేలమీద పొర్లాడింది....రక్తం జీరలుకట్టి నేలమీద ప్రవహిస్తోంది.

"చచ్చిందా ... ముండ..." చౌదరి గబగబ బయటకు నడిచాడు తన బాధ్యతంతా తీరినట్లు.

"లేదు...చావలేదు...చావలేదు .." చావు తెలివిలో అరిచి అరిచి ఒళ్ళు తెలీకుండా వచ్చిన గుడ్డుని కని శేషమ్మ... కాదు ఆంధ్రదేశం...ఆంధ్రదేశం...ఆంధ్ర దేశపు పల్లెసీమ ప్రాణాలు విడిచింది..."

నాకు తెలుసు నువ్వెంత బాధపడతావో...దూరాన ఏదో చోటవుండి ఆంధ్రుడివన్న పౌరుషంతో బతుకుతున్న నిన్ను ఎంత కష్టపెడుతుందో ఈ వార్త నాకు తెలుసు...

కృష్ణ రాసింది ఒకనాటి సాయంకాలం ఏదో పల్లెలో జరిగిన ప్రత్యేక ఘట్టంకాదు.

ప్రభుత్వ పరిపాలనకు ట్రేడుమార్కు చింతబరికెగా మారింది...నిత్యం ... ప్రతి ఘడియా...ప్రతి పల్లెటూరులోనూ...ఇదే దృశ్యం...ఎక్కడ చూసినా, ఎవరేమనుకొనేది విన్నా...ఇదే విషయం.

ఎందుకో తెలీకుండా...రైతులు ఏ భవిష్యత్తుకోసం దాచుకున్న ఆస్తులో నేలలో పొర్లాడుతున్నాయి...సంవత్సరం బ్రతుకుకోసం దాచుకున్న ఊరగాయలన్నీ కిరసనాయిలుతోటీ బొగ్గుతోటీ కుళ్ళి పల్లెలన్నీ కంపుకొడుతున్నాయి.

గ్రామాలన్నీ బీడుపోయి...నిర్జనంగా చిన్నపోయాయి...పూర్వంలాగ రాత్రి ఏ పదిగంటలకో ఏ యింట్లోంచో వినవచ్చే నాటకం పాటలు వినపట్టంలేదు... అమాయకమైన నవ్వు వినపట్టంలేదు ... ఏ వీధిలోంచి పోయినా...సన్నని వెక్కి వెక్కి ఏడుపు - ప్రతి యింటిలోంచీ శవం పోయిన దుఃఖం

ఏజాతి అభ్యున్నతి కిదంతా? ఏదేశం శాంతి భద్రతలకు? నిజమేనా అనిపిస్తోందా, కోటీ, నీకిదంతా?

ఒక్కసారి ఆంధ్రదేశం రా ... ప్రతీ రైలులోనూ...ప్రతీ కారులోనూ...ప్రతీ బండిలోనూ...నడిచి దూరదూరంగాపోయే ప్రతీ ఆంధ్రుడి కళ్ళల్లోకి చూడు కోటీ... అగుపించే నిరాశా...తీవ్రమైన ద్వేషం... సమైక్యంకోసం వేచివున్న పట్టుదలా... నీడలల్లే మెదుల్తాయి వాటిల్లో...

రెండువందల ఏళ్ళు నిర్బంధంలో నలిగిన ఆంధ్రరైతు రెండేళ్ళలో నాలుగొందల ఏళ్ళదాక తేరుకోలేని నిర్బంధానికి గురయ్యాడు...కాని ప్రతివాడి కళ్లూ రెండోవాడి కళ్ళల్లోకి ధీమాగానే చూస్తున్నాయి. నిబ్బరంగా ఆంధ్రసీమ ముందుకే ముందు ముందుకే చూస్తోంది కోటీ...

అదే జ్యోతి ... అదే మెరుపు ... మరింత గట్టిగా విశాలాంధ్రకి మేలుకొలుపు పాడుతోంది.

యుగయుగాలుగా సంస్కారం లేని తెలంగాణా పేదరైతు, కత్తికి కత్తి ఎదుర్కొడ్డి నాటుతుపాకులతో నైజాం మూకల్ని బైటికి పారదోలి ప్రజాస్వామ్యాన్నేర్పరచుకున్న తెలంగాణా రైతు పళ్లెల్లోంచి కారుతున్న రక్తంతో అడిగాడు, ఆంధ్ర రైతుని హేళనగా..."తెలిసిందా పీడకుల నిజం...బాధితుల ఆశయం..."

ఎంతో దూరంనుంచి గబగబముందుకు నడిచి తెలంగాణా రైతు ఆంధ్రుణ్ణి, ఆంధ్రదేశపు ప్రతి రైతునీ ప్రేమతో గట్టిగా కౌగలించుకున్నాడు!

మిలటరీ లారీలు కదిలాయి... నైజాం కోసం కాదు కోటీ... కానే కాదు. నాలుగు రోజుల్లో బయటపడిందంతా... దొంగలూ దొంగలూ కలిశారు... ఊళ్ళు పంచుకోవడమే మిగులు...

పల్లెటూళ్ళల్లో మళ్ళా నిశ్శబ్దం ఆవరించింది... ప్రతీ పల్లెటూళ్లోంచీ హారన్ చప్పుడు చేసుకుంటూ లారీలు పరిగెడుతున్నాయి... కొత్తగా కాంగ్రెసువతం పుచ్చుకున్న పెద్దమనుషులు...... గుసగుసలు... ఎవడి పేరో వాళ్ళ వాలిక ఉచ్చరిస్తుంది... ఎవడి తల్లో... తండ్రో... ఏ తల్లి కొడుకో... కూతురో తనకి తెలీని తప్పిదానికి... తను నమ్మిన ఆశయంకోసం ఆంధ్రసీమలో కూలిపోతున్నారు.

కాని ఆంధ్రసీమ బతుకుతోంది. బతికే హక్కుంది కనక... నందనవనం కాలుతోంది కోటీ... కాని మళ్ళీ పువ్వులు పూస్తాయి. మళ్ళీ రైతులు పంటలు కోసి ధైర్యంగా యిళ్ళకు తెచ్చుకుంటారు. మళ్ళీ యేయింటిలోంచో శెలవులకు యిళ్ళకు తిరిగొచ్చిన విద్యార్థుల పాటలు ... నవ్వులు వినిపిస్తాయి... రాత్రిపూట మర్రిచెట్టుకింద బాలవీరులు ధైర్యంగా ఆడుకుంటారు... రాత్రిపూట మన అమ్మలు అమ్మమ్మలు వీధుల్లో కూర్చుని ఖుషాసాగా కబుర్లు చెప్పుకుంటారు

ఆంధ్రదేశం కసితో రాజుకుంటోంది. బాధతో ఆవేశంతో ఆంధ్రదేశం వేసవి గాడ్పులాగ ఊగిపోతోంది. సామ్యవాదాన్ని ప్రసవించబోతున్న ధనికవాదం పిచ్చిపిచ్చికేకలేస్తోంది...

మళ్ళీ కొత్త జీవితానికి పునాదులు వెయ్యమని... తన శిరస్సునినవ్వేపువ్వుల్తో అలంకరించమని... ఈనాడు దీనంగా అరుస్తున్న ప్రతియింటి దీపం... మన అమ్మ కోర్కెని జ్ఞాపకం చేస్తున్నాయి.

మళ్లా పల్లెలోంచి పోలీసు లారీలు సాగుతున్నాయి. కొత్తగా కాంగ్రెసు మతం పుచ్చుకొన్న వాళ్లు పిచ్చెత్తినట్లు... ఇదుగో ఈ యిల్లే... అదుగో ఆయిల్లు ఇటూ అటూ చూపిస్తున్నారు... కారు ఆగుతుంది లారీలతో... ముందుకు సాగుతుంది...

ప్రతి యింటిలోనూ... ప్రతిపల్లెలోనూ ప్రతీహృదయంలోనూ కసిరాజుకుంటోంది.. ప్రతిహృదయంలోనూ రక్తం ప్రతీకారం కోసం ఉడుకుతోంది... అగ్ని రాజుకుంటోంది...

చాలా త్వరలోనే వింటావు శుభవార్త! కోటీ...

---

ఎంత భయంకర హింసాకాండను ప్రయోగించినా మానవజీవితం అక్షయమైనదే ఒకమూల ధ్వంసమైతే వందచోట్లనుంచి పుట్టి పెరుగుతుంది ”

— ఫ్యూజిక్

* టర్జినీవ్ *

# బిచ్చగాడు



వీధివెంట నడిచి వెడుతున్నా కృశించిపోయిన ఓ ముసలి బిచ్చగాడు నన్ను ఆపివేశాడు.

నెత్తురుకమ్మి నీళ్లు చిమ్మే నేత్రాలూ, నల్లని పెదవులూ, ...

చింకిగుడ్డలూ, చీముకారే గాయాలూ...అబ్బ! ఈ దౌర్భాగ్య జీవిని దారిద్ర్యం ఎంత ఘోరంగా తినివేసిందో!

వాచిన ఎర్రని మురికి చేతిని నావంక జాపాడు. మూల్గుతూ ఏమైనా సహాయం చేయమని గొణిగాడు.

నా జేబులన్నీ తడుముకో సాగాను... పర్సు లేదు, గడియారం లేదు, చివరకు జేబురుమాలైనా లేదు... కూడా ఏమీ తీసుకు రాలేదు... బిచ్చగాడు ఇంకా నిరీక్షిస్తూ ఉన్నాడు... జాపిన చెయ్యి బలహీనంతో వణికిపోయింది....

కంగారుతో, సిగ్గుతో, వణికే ఆ మురికి చేతిని ఆప్యాయంగా గట్టిగా పట్టుకున్నాను...

'కోప్పడకు భాయీ, నావద్ద ఏమీ లేదు, భాయీ'; నెత్తురు కమ్మిన కళ్లతో బిచ్చగాడు నావంక తేరి పారజూచాడు, నల్లని పెదవులు మందహాసం చేశాయి:

అతనూ చల్లని నా వేళ్లను గట్టిగా పట్టుకున్నాడు.

అయితే నేం, తమ్ముడూ ఇందుకు కూడా కృతజ్ఞుణ్ణి, ఇదీ దానమే తమ్ముడూ' అని గొణిగాడు.

నా సోదరుని వద్దనుండి నాకూ బహూకృతి లభించిందని తెలుసుకున్నాను.

---

అనువాదం:

శ్రీనివాస చక్రవర్తి

* కొడవటిగంటి కుటుంబరావు *

# కథాసాహిత్యం - పత్రికలూ



కథ అనేది ఏభాషలోనైనా అతి ప్రాచీనమైనదే ప్రపంచంలో మానవ సమాజమనేది ఏర్పడుతూనే కథ అనేది పుట్టిఉండాలి. కథ మానవసమాజానికి పునాదిగాకూడా పనిచేసి ఉండాలి. చరిత్రా, వ్యక్తుల భిన్నభిన్నానుభవాలూ కథలరూపంలో సమాజానికి సంక్రమించాయి. ఆచార వ్యవహారాలూ, విజ్ఞానమూ, నీతీ మొదలైనవి కథలద్వారానే ప్రచారం అయిఉండాలి. సాంఘిక పరిణామంలో ఎన్నెన్ని సాహిత్య స్వరూపాలు వెలువడినా వాటికి కథే ఆధారంగా ఉంటూవచ్చింది. కాని ఈ ఇతర సాహిత్యరూపాలు కథను వెనక్కితోసేశాయి.

మొదటి ప్రపంచయుద్ధం అయేవరకూ ఆధునిక తెలుగు సాహిత్యంలో కథకు ఎటువంటి స్థానమూ లేదనేచెప్పాలి. అన్ని సాహిత్యరూపాలలోనూ కృషి చేసిన వీరేశలింగంగారు కథజోలికి రాలేదు. అప్పట్లో పద్యానికీ, నవలకీ, నాటకానికీ, వ్యాసానికీ ఉన్నఘనత కథకి లేకపోయింది దానికి కారణం లేకపోలేదు. సాంఘిక ప్రయోజనం సాధించటానికి చిన్న కథ ప్రశస్తమైన పరికరం కాదు. అందులో సంఘాన్ని విపులంగా చిత్రించే అవకాశం లేదు. శిల్పచాతుర్యం చూపటానికిమటుకే అవకాశం ఉంది.

1919 నుంచీ ఈ శిల్పచాతుర్యానికి కూడా స్థానం లభించసాగింది సాహిత్యంలో. ఈ నూతన పరిణామఫలితంగా ఖండకావ్యమూ, చిన్నకథా ప్రాముఖ్యానికి వచ్చాయి. అచ్చగా కథలురాసినవారు కూడా సాహితీపరులనిపించుకోసాగారు. మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వం ఇది సాధ్యంకాలేదు.

తెలుగుసాహిత్యంలోకి అడుగుపెడుతూనే చిన్నకథ ప్రజాదరణ సంపాదించుకుని ఇతర సాహిత్యస్వరూపాలని వెనక్కితోయసాగింది. చిన్నకథా, ఖండకావ్యమూ బయలుదేరి దిగ్విజయంచేసి వచ్చాయి. ఇందువల్ల తెలుగు సాహిత్యానికి కొంత అపకారం జరిగిందనేది నిర్వివాదాంశం. ఈ దిగ్విజయంవల్ల ప్రజలకి ఘనమైన సాహిత్యంమీద విముఖత్వం కలిగింది. యథార్థమైన సాహిత్య ప్రయోజనం వెనకపడి రచయితల విశిష్టతకూ, ప్రత్యేకత్వాలకూ, శిల్పానికీ ప్రాధాన్యం ఏర్పడింది. నవలా, నాటకమూ వెనకపడి

• విమర్శ •

చిన్న కథా, ఖండ కావ్యమూ, ఏకాంకికా మొదలైన వాటికి ప్రచారం హెచ్చింది. నిజానికి ఇవి బలమైన సాహిత్యం కావు.

అయితే ఒకటి అనుకోవచ్చు. సాహిత్యం ఏ కొద్దిమంది ఆదరణో పొందుతూ అసంఖ్యాకులైన ప్రజలను అది అందుబాటులో లేని సమయంలో ఈ చిన్న కథా ఖండకావ్యమూ వచ్చి వారిలో సాహిత్య పిపాస రేకెత్తించాయనుకోవచ్చు; ఈ స్వరూపాలు పైకివచ్చి ఉదాత్తమైన సాహిత్యంమీద అభిమానం గలవారిని పాడుచేయలేదనుకోవచ్చు. ఈ వాదన కొంతవరకే నిజం. ఎందుకంటే చిన్న కథకి ప్రాముఖ్యంలేని కాలంలో నాటకమూ, నవలా ముందుకు వచ్చాయి. వీరేశలింగం గారు నాటిన చెట్టు ఫలించి అనేక నవలలూ, నాటకాలూ వెలువడ్డాయి. చిన్నకథ బయలుదేరిన తరవాతకూడా వీటి ప్రచారం కొంతకాలం బాగానే ఉండింది.

అయితే యింతలో పత్రికలు వచ్చాయి. చిన్నకథాఖండకావ్యమూ ఆరంభించిన పనిని ఈ పత్రికలు పూర్తిచేశాయి. పత్రికల విజృంభణతో ఈ స్వరూపాలకు ఎంతో ప్రచారమైనా సాగింది. (పత్రికలు లేనిచోట చిన్న కథకు ఇంత ప్రాముఖ్యం వచ్చే అవకాశమే లేదనుకోవచ్చు.)

పత్రికలు పుస్తకాలకంటె చౌక. ప్రకటనల ఆధారంతో అవి చౌకపాఠు అభిరుచులను సంతృప్తిపరుస్తూ, అసంఖ్యాక ప్రజలకు చౌకబారు సాహిత్యాన్ని అందిస్తాయి. అనేకమంది రచయితల, వివిధ రూపాల రచనలు వాటిలో ప్రకటితమవుతాయి. జరుగుతున్న విషయాలమీద వ్యాఖ్యానాలుంటాయి. బరువైన సాహిత్యం జోలికిపోని లక్షలాది ప్రజలు పత్రికల కెగబడతారు. సుదీర్ఘమైన నవలలూ, నాటకాలూ వీటిలో వెలువడే అవకాశం తక్కువ. విడిగా అచ్చువేసినట్టయితే నవలలూ, నాటకాలూ, ఈ పత్రికలంత చౌకగా అమ్మవు. నికరమైన, నిశ్చలమైన సాహిత్యాభిలాష కలవారు కొందరు పుస్తకాలు కొన్నప్పటికీ పత్రికలు చదివేవారి సంఖ్యతో పోలిస్తే వారి సంఖ్య అల్పం.

పత్రికలు వచ్చి అధిక సంఖ్యాకులలో చౌకబారు సాహిత్యంమీద అభిలాష కలిగించినమాట నిజమే. అయినా, బలమైన సాహిత్యంమీద అభిలాష గలవారి సంఖ్య వీటివల్ల పెరగలేదనేది నిశ్చయం. అటువంటి సాహిత్యప్రియులసంఖ్య తగ్గిందేమో అనిపిస్తుందికూడాను. జరిగిన 30 ఏళ్ల కాలంలోనూ ఒక లక్ష చిన్న కథలు పత్రికలద్వారా వెలువడ్డాయని అంచనా కడితే అందులో రెండు వేలన్నా పుస్తకరూపంలో వెలువడ్డాయనుకోవటానికి అవకాశం లేదు. పైపెచ్చు ఈ 30 ఏళ్ళలోనూ నవలా, నాటకమూ క్రమంగా క్షీణించాయి.

ఇది తెలుగు సాహిత్యానికి తీరని నష్టం. అందుకని మనం పత్రికలను అణచటంగాని, కథాసాహిత్యాన్ని వెలి వెయ్యటంగాని సాధ్యం కానిపని. ఈ నష్టం మరొక విధంగా మనం పూడ్చుకోవాలి. దీనికోసం ఇదివరలో జరిగిన ప్రయత్నాలు విఫలమయినాయనే చెప్పాలి. సాహితీ, శారదా సఖీ, భారతీ, జయంతీ, ఉదయినీ, తెలుగుతల్లీ, అభ్యుదయా, ప్రతిభా మొదలయిన

సాహిత్య పత్రికలకు ఆంధ్రలోకం చూపిన ఆదరం చూస్తే దేశంలో సాహిత్యప్రియులంటూ ఎవరైనా ఉన్నారా అనే సందేహం ఎవరికైనా కలుగుతుంది.

చాకబారు పత్రికల్లోనే మంచి సాహిత్యంగా పరిగణించదగిన కథలూ, ఖండకావ్యాలుకూడా వెలువడుతున్నాయి; తుక్కు రచనలతో బాటు! ఈ పరిస్థితి ఏ యితర భాషా సాహిత్యంలోనూ ఉన్నట్టు కనబడదు. తెలుగులో నాలుగైదు ఉత్తమ సాహితీ పత్రికలు వెలువడి, ఆర్థికంగా వాటికి మంచి పునాది ఏర్పడి సాహిత్య ప్రియులు కాగోరేవారు వివచనా జ్ఞానంతో వాటిని పోషించడానికి పూనుకున్నవాడు నీళ్ళకి నీళ్లూ, పాలకి పాలూ విడిపోతాయి.

సాహిత్య సంస్థలు నడిపే పత్రికలు కూడా కళాకాంతులు లేకుండా, నాశనమై పోవటానికి కారణాలు ఆలోచించదగినవి. ఈ పత్రికలకు ఆర్థిక సహాయం లేదు. ఇందులో రాసేవారికి పారితోషికాలులేవు. పేరున్న ఉత్తమ రచయితలు వీటిలోనే రాస్తారనే నమ్మకంలేదు. వీటికి ప్రకటనల మద్దతులేదు. వీటికి ప్రత్యేకించి అందమైన స్వరూపంలేదు. ఇదంతా ఒక ఉద్యమంగా సాగాలి. సాహిత్య ప్రియులైన రచయితలూ, పాఠకులూ, కలిసిగాని వేరు వేరుగాగాని ఈ ఉద్యమానికి స్వరూపం యివ్వాలి.

కథాస్వరూపం పత్రికల దోపిడీకి అనుకూలంగా ఉన్నదన్నమాటేగాని, కథకూడ కొద్దిలో ఉత్తమ సాహిత్య ధర్మం నెరవేర్చగలదనటానికి ప్రబలమైన సాక్ష్యం ఉంది. ఆ సాహిత్యం చౌక పత్రికలలో పడి వాటితోపాటే నశించిపోకుండా చూడాలి.

పత్రికలకన్నా కూడా అధిక ప్రచారం జరగవలసినది పుస్తకాలకు. ఉత్తమతరగతి కథలతోపాటు నవలలూ, నాటకాలూ కూడా వెలువడేందుకు మార్గం ఏర్పడ్డనాడు మన సాహిత్యానికి చౌకబారు సాహిత్యం నుంచీ, పత్రికలనుంచీ విముక్తి ఏర్పడుతుంది.

---

తాము విశ్వసించి కృషిచేసే ఆదర్శానికి ప్రమాదం వచ్చినప్పుడు :

"నిజాయితీపరులు ప్రతిఘటిస్తారు, ద్రోహులు బైటపడతారు, వీరులు పోరాడుతారు, బలహీనులు దిగజారిపోతారు."

— ఫ్యూజిక్

---

* రామమోహన్ *

# యుద్ధం! యుద్ధం!!



ప్రదేశం

మద్రాసు రాజధానిలో ఒక నగరం

కాలం

1948 జులై నెల

రంగం:

మిల్లు లోపలి భాగంలో

సమయం

ఉదయం 7 కావస్తోంది.

పాత్రలు

| | |
|---|---|
| రామయ్య<br>భూషయ్య<br>రాజన్న<br>లచ్చన్న<br>మాణిక్యం<br>కిష్టప్ప | కూలీలు |
| మేస్త్రీ<br>మేనేజరు<br>డాక్టరు | మిల్లు వుద్యోగులు |

ఫోటోగ్రాఫరు

సాక్షులు

[మిల్లులోపల యంత్రాలశాలలో ఒక యంత్రానికి సమీపంలో ఆరుగురుకూలీలు నిలబడివున్నారు.

వారిమధ్యన జ్వరపీడితుడైన మాణిక్యం కూర్చుండివున్నాడు. వారంతా సైరన్ మోతకోసం కని పెట్టుకొనివున్నారు.]

రామయ్య: ఎల్లావుందివాళ?

మాణిక్యం: నీరసంగావుంది. నిన్నటినుంచి కడుపులో పేగులు ఎక్కుతున్నాయి.

లచ్చన్న: జ్వరమేనా తగ్గలేదు?

రామ: మందెక్కడేడిసింది?

మాణి: రంగునీళ్ళిస్తున్నాడు.

రాజ: నీమాట మరీ బాగుందిరోయ్! ఊరికేపెట్టే అమ్మా, నీ మొగుడితో సమంగా పెట్టమన్నట్టుంది.

మాణి: మన కెవ్వరూ ఊరికే పెట్టడం లేదు.

లచ్చ: రెక్కలకష్టం చేసుకొంటూన్నాం.

కిష్టప్ప: బాగాచెప్పావు.

భూషయ్య: వాడి బాబుసొమ్ము కొల్లబోస్తూన్నాడు.

రామ: పైగా ఈ బందిఖానామొండు.

• నాటిక •

మాణి: పెళ్ళాం పిల్లల్ని కూడా చూసుకో నివ్వడంలేదు

రాజు: బయటికిపోతే వాళ్ళు రానివ్వరేం...

మాణి: ఇక్కడబావుకుంటూన్న దేమిటికీ.

భూష: ఎరక్కపోయి వచ్చాం.

లచ్చ: కడుపాత్రం అల్లా తరిమింది.

కిష్ట: వాళ్ల కడుపు కొడుతున్నాం—

రాము: మన కడుపు కొట్టుకొంటున్నాం.

రాజు: ఈ తెలివి మొదటే వుంటే...

భూష: నువొక్కడివే మిగిలేవాడివి.

లచ్చ: మేస్త్రీ

కిష్ట: మేస్త్రీ

మాణి: వస్తున్నాడా? (లేస్తాడు)

రాము: వచ్చాడు.

[ మేస్త్రీ పెద్ద అంగలు వేసుకొంటూ వస్తాడు. కూలీలంతా సంభాషణ కట్టి పెడతారు. ]

మేస్త్రీ: ఇక్కడే వున్నారేం?

రాజు: చిత్తం వెడుతున్నాం.

రాము: ఇంకా వేళ కాలేదు.

మేస్త్రీ: వేళయ్యాక బయల్దేరుతావా?

లచ్చ: వేళ కాకుండానే బయల్దేరాం.

మేస్త్రీ: ఎవరికోసం బయల్దేరుతారేం?

రాజు: ఔనండి. ఔనండి అంతే.

మేస్త్రీ: చూశావుగా సంబరం. సమ్మె అన్నారు. ఇంట్లో కుండలు డింకీలు కొడుతున్నాయి.

రాజు: అంతేనండి.

మేస్త్రీ: మీకు లోటేంవుంది?

మాణి: (నెమ్మదిగా) మందు.

కిష్ట: (గట్టిగా) డాక్టరున్నాడు

మేస్త్రీ: ఆ డాక్టరున్నాడు హాస్పిటలుంది

రాజు: పోలీసులచేత దెబ్బలుతింటే వాళ్ళని హాస్పిటలులోకూడా చేర్చుకోడంలేదు

మేస్త్రీ: సమ్మెవాళ్ళని...

రాజు: సమ్మెవాళ్ళని...

మేస్త్రీ: సమ్మెవాళ్ళు మిమ్మల్ని కొడతారేమోనని మేనేజ్‌మెంటు మీకు పోలీసు కాపలా యిచ్చింది.

రాజు: ఇంటికెళ్ళకుండా తిండి ఏర్పాటు చేసింది.

మేస్త్రీ: వెయ్యికళ్ళ కనిపెడుతూంది.

మాణి: మందులులేని హాస్పిటలు నిచ్చింది

రాజు: బయట ఆమాత్రమూ లేదుగా.

రాము: ఇక్కడేందుకుంది?

భూష: ఇక్కడ జనంచావకూడదనేమో

లచ్చ: చచ్చిపోవాలిగనక గాదుగద.

మేస్త్రీ: (రాజన్న ముఖం చూస్తాడు) మిమ్మల్ని గురించి ప్రధానమంత్రి ఏం చెప్పారు.

రాము: ఎన్నోనా చెప్పివుంటారు.

మేస్త్రీ: పత్రికలనిండా అదే

లచ్చ: మాకు చదువు రాదుగా?

మేస్త్రీ: పోనీ చెవులో?

రాజు: నాకున్నాయి.

రాము: వాటిమధ్య మాత్రం ఖాళీ ఆకాశం!

మేస్త్రీ: (రామయ్యను చురచురన చూస్తాడు) రేడియో అస్తమానం వాగుతుందిగదా, ఏం వినడంలేదూ?

రాజు: నేను విన్నాను.

మేస్త్రీ: విన్నవారినుంచి తెలుసుకోవలసింది

లచ్చ: తెలుసుకోడానికి, ఎక్కడికైనా వెడితే?

మేస్త్రీ: ఎలా వెడతాం. మనప్రధానిచెప్పి నట్లు మనం యుద్ధరంగంలో వున్నాం. ఆయన చెప్పినట్లు యుద్ధరంగంలోని మనిషి కదలడానికి వుండదు.

రాజ: మన ప్రధానిది ఏం తెలివి ?

రాము: మనం ఓర్చుకోవలసిన కష్టాల్ని గురించికూడా చెప్పేవుంటారు.

మేస్త్రీ: సైనికుడు కష్టాల్ని ఓర్చుకోవాలని వేరే చెప్పాలా ?

లచ్చి: కష్టాలకి ఓర్చుకోవడం మనకెప్పటినుంచో అలవాటు.

మేస్త్రీ: ఏమైతేనేం ? మనం సుఖంబలిసి మన అలవాట్లన్నీ మరచిపోతున్నాం.

రాజ: మా ముత్తాతగారు మూడు నెలలు భోజనం మొహం చూడకపోయినా, పారపుచ్చుకుంటే చేసంతా దమ్ము చేసేసేవాడుట.

భూషు: నీది మీ ముత్తాత పోలికే.

మేస్త్రీ: మనకటువంటిమనుష్యులేకావాలి. ఈవేళ మనదేశం చాలా ప్రమాదంలో వుంది.

రాము: దేశం అంటే మన్ను కాదోయ్ !

లచ్చి: మనుష్యులక్షేమం తెగులు.

మేస్త్రీ: మనవాళ్ళు పైనవుండగా మనకే ప్రమాదం రానివ్వరు.

రాజ: మన తలవెంట్రుక కదలదు.

రాము: మనకెందరో పోలీసుల సాయం యిస్తారు.

మాణి: మన యిళ్ళేమౌతున్నాయో.

మేస్త్రీ: యుద్ధంలో విజయంపొందేవరకూ మనం యిళ్ళమాట ఆలోచించనే కూడదు.

రాజ: మనగవర్న మెంటేవుంది అన్నింటికీ

మేస్త్రీ: మనశత్రువులుపూర్తి అయ్యేవరకూ.

రాము: వీళ్ళని నలిపి వెయ్యాలి.

మేస్త్రీ: భేష్ ! అలా వుండాలి పట్టుదల.

మాణి: మన యీ బాధలకి కారణమైన శత్రువుల్ని...

అందరూ: నలిపి వేద్దాం.

[రాజన్న మినహా అందరూ తలో మూలకూ వెళ్ళిపోతారు.]

రాజ: రామయ్యండి దీనికంతకీ...

మేస్త్రీ: ఏమి టతని ధోరణి ?

రాజ: మందులు లేకటు, ఇది బందిఖానా యటు, బైటికి పోవటం బాగటు...

మేస్త్రీ: ఆరి కమ్యూనిస్టు !

రాజ: అంతా కమ్యూనిస్టులేనండి...

మేస్త్రీ: ఏం చెప్పుకొంటూంటారో చెప్పు. నీకు బహుమతి వస్తుంది. మన ప్రధాన మంత్రిగారిచేత సర్టిఫికెట్ ఇప్పిస్తాను...

రాజ: (చేతులు నలుపుతూ) తమ దయ !

మేస్త్రీ: మేనేజరుగారువస్తున్నారు వెళ్ళు

[రాజన్న సంతోషంతో పరుగెత్తుతాడు. వేరొకవేపునుంచి మేనేజరు గంభీరంగా నడిచివస్తాడు.]

మేస్త్రీ: (వంగి నమస్కరించి) నమస్కారమండి.

మేనే: (నమస్కారంఅందుకొని) ఏమిటి అంతా హడావిడిగావున్నట్లు కనబడుతూంది. కనిపెట్టావా ?

మేస్త్రీ: (భయపడుతూ) చిత్తం. రామయ్య గంద్రగోళం తెస్తున్నాడండి.

మేనే: రామయ్యంటే...

మేస్త్రీ: తెల్లకన్ను వాడండి.

మేనే ఓ నేను మొదటేఅనుకొన్నాను

మేస్త్రి: అతను కమ్యూనిస్టు
మేనే: కాదని నువ్వే వాదించావు
మేస్త్రి: ఇదివరకు కాదండి. కమ్యూనిస్టుని ఎలక్షన్లలో తన్నాడు కూడానండి.
మేనే: సార్జంటుకి చూపించు.
మేస్త్రి: గొడవలు వస్తాయేమోనండి.
మేనే: రాకుండా మనం తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. బాగా పనిచేసేవాళ్లని ఫోటోలు తీయించి పత్రికల కిద్దాం. వారికి బహుమానాలిద్దాం.
మేస్త్రి: (సంతోషంతో) రాజన్న అని పని వాడొకడున్నాడండి.
మేనే: మంచి పనివాడేనా ?
మేస్త్రి: వాళ్ళ వార్తలు కనిపెట్టడంలో చాల సాయపడుతున్నాడండి.
మేనే: అటువంటి పనివారికి ప్రోత్సాహం యివ్వాలి. వెళ్ళి వెంటనే ఫోటోగ్రాఫరుకి ఫోనుచేయమని గుమస్తాతో చెప్పు. నువ్వు సార్జెంటుని నాదగ్గిరకి పంపు.
మేస్త్రి: (సంతోషంతో) చిత్తం (వెడతాడు)
[ హడావిడిగా డాక్టరు వస్తాడు ]
మేనే: నమస్తే.
డాక్టరు: నమస్తే.
మేనే: మీరౌండ్ పూర్తి అయినట్లుంటే. మా ఆఫీసుకుపోదాం. (కదులుతాడు)
డాక్టరు: ఏమంత తొందర పనా? నా పని యిప్పుడే ప్రారంభించాను.
మేనే: చాలమంది జబ్బు పడుతున్నట్లు రిపోర్టులు వస్తున్నాయి. కారణం?
డాక్టరు: శారీరకం, మానసికం కూడా
మేనే: మన ప్రధాని చెప్పినట్లు మనదేశం యిప్పుడు యుద్ధపరిస్థితుల్లో చిక్కుకొని వుంది
డాక్టరు విజయం మనదే
మేనే: కొద్దిరోజులు నిలబడగలిగితే-
డాక్టరు: నిలబడతాం.
మేనే: మనం కాదు.
డాక్టరు: సమ్మెవాళ్ళా ?
మేనే: మన కూలీలు...
డాక్టరు: నిలబడలేకపోవడం ఏమిటి ?
మేనే: మనం కనీసపు జనంతో పని చేస్తూన్నాం.
డాక్టరు: నేనెరగనూ ?
మేనే: ఒక్క మనిషి తగ్గినా పనిసాగదు.
డాక్టరు: (ఆలోచనగా) ఔను.
మేనే: పని సాగుతూన్నంతవరకే మన శత్రువులు లొంగివస్తారు.
డాక్టరు: అర్థం అయింది. కాని...
మేనే: చెప్పండి...
డాక్టరు: తిండిమార్చాలి.
మేనే: (ఆలోచనగా) అసాధ్యం!
డాక్టరు: మొక్కజొన్నలు పడకపోవటం చేతనే జబ్బులు...
మేనే: ప్రభుత్వం సప్లయిఅది అదితోసేసి బియ్యం కొనాలంటే చాలా ఖర్చు పెరుగుతుంది. డైరెక్టర్లు అంగీకరించరు.
డాక్టరు: మందులుకూడా ఏమీ లేవు.
మేనే: రోగాల్ని మనం కుదర్చనూలేము. అది మన పనీకాదు. చిన్న చిన్న గాయాలు తగిలినా పెద్దకంపెన్సేషన్లు అడిగి దేశాన్ని నష్టపెట్టకుండేందుకే మన హాస్పిటలు అవసరం...
డాక్టరు: మానసికంగా ప్రోత్సాహం కలిగించాలంటే...
మేనే: ఇళ్ళకుపోయి రానివ్వాలంటారు. అసంభవం ఒక్కడు తిరిగిరాడు.

మేస్త్రీ: ఎలా వెడతాం మనప్రధానిచెప్పి నట్లు మనం యుద్ధరంగంలో వున్నాం ఆయన చెప్పినట్లు యుద్ధరంగంలోని మనిషి కదలడానికి వుండదు.

రాజ: మన ప్రధానిది ఏం తెలివి ?

రాము: మనం వోర్చుకోవలసిన కష్టాల్ని గురించికూడా చెప్పేవుంటారు.

మేస్త్రీ: సైనికుడు కష్టాల్ని వోర్చుకోవాలని వేరే చెప్పాలా ?

లచ్చ: కష్టాలకి వోర్చుకోవడం మనకెప్పటి నుంచో అలవాటు.

మేస్త్రీ: ఏమైతే నేం ? మనం సుఖంబలిసి మన అలవాట్లన్నీ మరచిపోతువాం.

రాజ: మా ముత్తాతగారు మూడు నెలలు భోజనం మొహం చూడకపోయినా, పొరపుచ్చురంటే చేనంతా దమ్ము చేసే సేవామట.

భూమ: నీది మా ముత్తాత పోలికే.

మేస్త్రీ: మనకటువంటి మనుష్యులే కావాలి. ఈవేళ మనదేశం చాలా ప్రమాదంలో వుంది.

రాము: దేశం అంటే మన్ను కాదోయ్ !

లచ్చ: మనుష్యులకేం తెగులు.

మేస్త్రీ: మనవాళ్ళు పైనవుండగా మనకే ప్రమాదం రానివ్వరు.

రాజ: మన తలవెంట్రుక కదలదు.

రాము: మనకెందరో పోలీసుల సాయం యిస్తారు.

మాణి: మన యిళ్ళేమౌతున్నాయో.

మేస్త్రీ: యుద్ధంలో విజయంపొందేవరకూ మనం యిళ్ళమాట ఆలోచించనే కూడదు.

రాజ: మనగవర్నమెంటేవుందిఅన్నింటికీ

మేస్త్రీ: మనశత్రువులుపూర్తి అయ్యేవరకూ రామ వీళ్ళని నలిపి వెయ్యాలి

మేస్త్రీ: భేష్! అలా వుండాలి పట్టుదల.

మాణి: మన యీ బాధలకి కారణమైన శత్రువుల్ని...

అందరూ: నలిపి వేద్దాం.

[రాజన్న మినహా అందరూ తలో మూలకూ వెళ్ళిపోతారు.]

రాజ: రామయ్యండి దీనికంతకీ...

మేస్త్రీ: ఏమి టతని ధోరణి ?

రాజ: మందులు లేవటు, ఇది బందిఖానా యటు, బైటికి పోవటం బాగట...

మేస్త్రీ: ఆర కమ్యూనిస్టు !

రాజ: అంతా కమ్యూనిస్టులేనండి...

మేస్త్రీ: ఏం చెప్పుకొంటూంటారో చెప్పు. నీకు బహుమతి వస్తుంది. మన ప్రధాన మంత్రిగారిచేత సర్టిఫికెట్ ఇప్పిస్తాఊ...

రాజ: (చేతులు నలుపుతూ) తమ దయ !

మేస్త్రీ: మేనేజరుగారువస్తూన్నారు వెళ్ళు

[రాజన్న సంతోషంతో పరుగెత్తుతాడు. వేరొకవేపునుంచి మేనేజరు గంభీరంగా నడిచివస్తాడు.]

మేస్త్రీ: (వంగి నమస్కరించి) నమస్కారమండి.

మేనే: (నమస్కారం అందుకొని) ఏమిటి అంతా హడావిడిగావున్నట్లు కనబడుతూంది. కనిపెట్టావా ?

మేస్త్రీ: (భయపడుతూ) చిత్తం. రామయ్య గందరగోళం తెస్తున్నాడండి.

మేనే: రామయ్యంటే...

మేస్త్రీ: తెల్లకన్ను వాడండి.

మేనే: ఓ నేను మొదటేఅనుకొన్నాను

మేస్త్రీ: అతను కమ్యూనిస్టు

మేనే: కాదని నువ్వే వాదించావు

మేస్త్రీ: ఇదివరకు కాదండి. కమ్యూనిస్టుని ఎలక్షన్లలో తన్నాడు కూడానండి.

మేనే: సార్జంటుకి చూపించు.

మేస్త్రీ: గొడవలు వస్తాయేమోనండి.

మేనే: రాకుండా మనం తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. బాగా పనిచేసేవాళ్ళని ఫొటోలు తీయించి పత్రికల కిద్దాం. వారికి బహుమానాలిద్దాం.

మేస్త్రీ: (సంతోషంతో) రాజన్న అని పనివాడొకడున్నాడండి.

మేనే: మంచి పనివాడేనా ?

మేస్త్రీ: వాళ్ళ వార్తలు కనిపెట్టడంలో చాల సాయపడుతున్నాడండి.

మేనే: అటువంటి పనివారికి ప్రోత్సాహం యివ్వాలి. వెళ్ళి వెంటనే ఫొటోగ్రాఫరుకి ఫోను చేయమని గుమస్తాతో చెప్పు. నువ్వు సార్జెంటుని నాదగ్గిరికి పంపు.

మేస్త్రీ: (సంతోషంతో) చిత్తం (వెడతాడు)

[ హడావిడిగా డాక్టరు వస్తాడు ]

మేనే: నమస్తే.

డాక్టరు: నమస్తే.

మేనే: మీరౌండ్ పూర్తి అయినట్లుంటే మా ఆఫీసుకుపోదాం. (కదులుతాడు)

డాక్టరు: ఏమంత తొందర పనా ? నా పని యిప్పుడే ప్రారంభించాను.

మేనే: చాలమంది జబ్బు పడుతున్నట్లు రిపోర్టులు వస్తున్నాయి. కారణం?

డాక్టరు: శారీరకం, మానసికం కూడా

మేనే: మన ప్రధాని చెప్పినట్లు మనదేశం యిప్పుడు యుద్ధపరిస్థితులలో చిక్కుకొని వుంది.

డాక్టరు విజయం మనదే

మేనే గద్దిగోడుగా నిలబడగలిగితే-

డాక్టరు: నిలబడతాం.

మేనే: మనం కాదు.

డాక్టరు: సమ్మెవాళ్ళా ?

మేనే: మన కూలీలు...

డాక్టరు: నిలబడలేకపోవడం ఏమిటి ?

మేనే: మనం కనీసపు జనంతో పని చేస్తున్నాం.

డాక్టరు: నేనెరగనూ ?

మేనే: ఒక్క మనిషి తగ్గినా పనిసాగదు.

డాక్టరు: (ఆలోచనగా) ఔను.

మేనే: పని సాగుతూన్నంతవరకే మన శత్రువులు లొంగివస్తారు.

డాక్టరు: అర్థం అయింది. కాని...

మేనే: చెప్పండి...

డాక్టరు: తిండిమార్చాలి.

మేనే: (ఆలోచనగా) అసాధ్యం !

డాక్టరు: మొక్కజొన్నలు పడకపోవటం చేతనే జబ్బులు...

మేనే: ప్రభుత్వం సప్లయిఅది. అదితోసేసి బియ్యం కొనాలంటే చాలా ఖర్చు పెరుగుతుంది. డైరెక్టర్లు అంగీకరించరు.

డాక్టరు: మందులుకూడా ఏమీ లేవు.

మేనే: రోగాల్ని మనం కుదర్చనూలేము. అది మన పనికాదు. చిన్న చిన్న గాయాలు తగిలినా పెద్దకంపెన్సేషన్లు అడిగి దేశాన్ని నష్టపెట్టకుండేందుకే మన హాస్పిటలు అవసరం...

డాక్టరు: మానసికంగా ప్రోత్సాహం కలిగించాలంటే...

మేనే: ఇళ్ళకుపోయి రానివ్వాలంటారు. అసంభవం. ఒక్కడు తిరిగిరాడు.

డాక్టరు: తమ పోరాటమేమిటి ?

మేనే: మన పోరాటం మన ప్రభుత్వం సాగిస్తున్న పోరాటంలో ఒక భాగం. భారతదేశం పెద్ద యుద్ధరంగం, మన ఫ్యాక్టరీ చిన్నరంగం.

డాక్టరు: సందేహంలేదు.

మేనే: చిన్న పోరాటాలలో విజయం పొందితేనే యుద్ధ పర్యవసానం మన కనుకూలంగా తేలుతుంది.

డాక్టరు: కాని, మన పనివాళ్ళు...

మేనే: మన నాయకులే మనకి ఆదర్శం. కానివ్వండి. వివరంగా మాట్లాడు కుందాం. తర్వాత ఆఫీసుకి రండి... (వెడతాడు)

డాక్టరు: (బుర్రగోక్కుంటూ) కుండె డన్నం కుండలో నేవుండాలి, కుర్రాడు గుండులా వుండాలి. గట్టిసమస్యే.. (రెండడుగులు వేస్తాడు)

మాణి: (వెనుకవేపునుంచి ప్రవేశించి) డాక్టరుగారూ !

డాక్టరు: (ఆగి) నీకోసమే వచ్చా నోయ్.

మాణి: మీకోసం వెళ్ళేనండి.

డాక్టరు: ఎలావున్నావు. నాలిక ఏదీ ? (గబగబ పరీక్ష చేస్తాడు) వో. తగ్గి పోయింది పిడుగులా వున్నావు.

మాణి. ఏం తగ్గిందండి ? నిలబడలేకుండా వున్నాను. కడుపులో పోట్లు హెచ్చు గావున్నాయి.

డాక్టరు: అదేముంది ? ఆనకరా మంచి మందిస్తా. (కదులుతాడు)

మాణి (వెంటబడి) నాకీపూట సెల వ్వాలండి

డాక్టరు (ఆశ్చర్యం నటిస్తూ) సెలవు ? సెలవెందుకోయ్ ?

మాణి: చచ్చిపోతానండి. చాలాబాధగా వుంది.

[రామయ్య ప్రవేశిస్తాడు]

రామ: నమస్కారం డాక్టరుగారూ ! మన మాణిక్యం విషయం చూశారా ?

డాక్టరు: అతను బాగున్నాడోయ్ యిప్పుడు సెలవెందుకు ?

మాణి: నా శరీర స్థితి నాకు తెలుస్తోంది.

డాక్టరు: మనం యుద్ధంలో వున్నాం. మన దేశం పెద్దయుద్ధంలోనూ, మనం చిన్న యుద్ధంలోనూ వున్నాం.

రామ: మా శత్రువులెవరో మా కింతవరకు తెలియడం లేదండి.

డాక్టరు: అది మీకు తెలిసేలా చెప్పా లంటే పూటపని. ఒక్కటి తెలుసుకో చాలు. మనం మన స్థానాలలో నిల బడి ప్రాణం వున్నంతవరకు...

మాణి: తర్వాతండి... ?

డాక్టరు: దేశంలో నలభై కోట్లమంది వున్నారు. వాళ్లు మన స్థానం ఆక్ర మిస్తారు.

[వెళ్ళి పోతాడు.]

[సైరన్ మోగుతుంది. రామయ్య పరుగెత్తిపోతాడు. మాణిక్యం యంత్రంవద్ద నెమ్మదిగా వెళ్ళి పడిపోతాడు.]

మేస్త్రీ: (వచ్చి, చూసి) మాణిక్యం! (లేవ దీయబోతే తల వ్రేలవేస్తాడు. భయంతో వదలి వెడతాడు) కృష్ణయ్యా! త్వరగా!

కృష్ణ: (పరుగెత్తి వస్తాడు) ఏమిటిది !

మే: చూస్తూండు డాక్టరును తీసుకు వస్తా (పరుగెత్తుతాడు)

కృష్ణ: (మాణిక్యాన్ని లేవదీయబోతాడు) చచ్చిపోయాడు. (గట్టిగా) రామయ్యా లచ్చన్నా!

[మేనేజరు, మేస్త్రీలు, డాక్టరుతో పరుగెత్తి వస్తారు]

డాక్టరు: (పరీక్షించి) చచ్చిపోయాడు.

మే: యంత్రంవద్ద పని చేస్తూ చచ్చిపోయాడు.

మేనే: ఈతన్ని గురించి వెంటనే పత్రికలకు ఫోన్ చేయించండి.

డాక్టరు: ఆదర్శవ్యక్తి. మన ప్రధాని వాక్యాలను అక్షరశః అమలు జరిపాడు. తన స్థానంలో ప్రాణాలిచ్చాడు.

మేస్త్రీ: ఈతని ఫోటోలు పత్రికలకి పంపుదాం. వాళ్ళకి సిగ్గువస్తుంది.

మేనే: ఐడియా. ఫోటోగ్రాఫర్‌ని పిలిపించండి.

(కార్మికులంతా పరుగెత్తివస్తారు)

రామ: (విచారంతో) చంపేశారా?

లచ్చన్న: పిల్లల్ని చూడాలని ఏమి గోల పెట్టాడు!

మేనే: పెళ్ళాం పిల్లలకి వెంటనే ఏమన్నా పంపిస్తాం. మీ రేమీ విచారపడకండి.

[ఫోటోగ్రాఫరు హడావిడిగా పరుగెత్తి వస్తాడు.]

ఫోటో: (సర్దుకుంటూ) తప్పుకోండి.

మేనే: వెలుతురు చాలుతుందా?

ఫోటో: ఆ. (నాలుగువేపులకూ తిరిగి చూస్తాడు.)

మేస్త్రీ: బయట కూర్చోబెడితే.

మేనే: యంత్రంవద్దనేతీస్తే దానికి మాంఛి ఎఫెక్టు వుంటుంది

డాక్టరు: ఔను. ఇక్కడే తియ్యండి.

రామ: ఈ మూలనుంచి తీయండి.

ఫోటో: కూర్చోబెట్టాలి.

కిష్టయ్య: అలాగే వుంచాలి.

భూష: కదపకండి.

ఫోటో: మొగం కనబడదు.

రామ: కూలివాడికి మొహంలేదు.

భూష: మీరెల్లా చంపేశారో ప్రపంచానికి తెలుస్తుంది. అల్లాగే ఫోటో తియ్యండి.

మేనే: (కంగారుపడి) ఇక్కడ వద్దు. వీధిలో.

లచ్చ: ఇక్కడే తియ్యాలి

కిష్ట: ఇక్కడే ఫోటో.

మేనే: అయితే అసలు తియ్యడానికి వీలులేదు. (ఫోటోగ్రాఫర్ చేయిపట్టుకొంటాడు)

కూలీలు: ఇక్కడ తియ్యవలసిందే. ఫోటో కావాలి.

రామ: నువ్వు తియ్యాలి. (ఫోటోగ్రాఫర్ చేయిపట్టుకొని లాగుతాడు)

మేనే: పోలీస్! పోలీస్!

[పారిపోతాడు అతని వెనకనే డాక్టరు మేస్త్రీ పరుగెత్తుతారు. బయట ఈలలు చప్పుడు.]

కార్మికులు: సమ్మె చెయ్యండి! పనులు నిలపండి! సమ్మె!

రామ: తియ్యి, ఫోటో.

ఫోటో: (గొణుక్కుంటూ) వెలుతురు చాలదు.

కిష్ట: ఇంతాక చాలుతుందన్నావు కాదట్రా.

( మిగతా 80వ పేజీలో )

* సోమసుందర్ *

# ఆకలి నాలుకలన్నీ



కాలం బ్రతుకు తెరువు ప్రక్కన
విరిసిన దిరిసెన చెట్టుక్రింద
మసకమసక నీడల్లో కూర్చుని,
పాపం'—ముసలి చరిత్ర—
పూర్వగాథ స్మరిస్తోంది!
గతానుభూతుల
పచ్చని, నులివెచ్చని జ్ఞాపకాలు
నెమరేస్తోంది!!
పేదజనుల లోకం
దాఖలు చేసుకున్న
ఆకలి దరఖాస్తులు
అందుకోనని కర్కశ పరిపాలన
  ఈసుచేల అన్నార్తులలోకం,
  ఆకలికంటుకుపోయినపొట్టల..
  ఆకలి ఆరాటంతో కనలికనలి,
  అలమటించిజీరపడినగొంతుల..
  ప్రదర్శనం చేస్తుంటే
  చూడని వినిపించుకోనని
  దుర్మదాంధ - దుశ్శాసన
  కర్కశ పరిపాలన!
ఆకలి నాలుకలెన్నో
ఏకమౌచు ద్వారంకడ అరుస్తూంటె,
'అరచి అరచి అరచి అవే
అలసి తిరిగిపోతవిలే!'
అని తలపోస్తూ
ఆయాసంతో ఒగురుస్తూ,
విలాసాల కైలాసం కట్టుకున్న
కుబేర లాభార్థులలోకపు
కర్కశ పరిపాలన!
పాపం, చరిత్ర, ముదుసలి
నివ్వెర పోతోంది!
ధనస్వామ్య లోకపుకోపం
పేదజనుల లోకంపైవిసరిన
పగనాగుల శాపానికి
  బెదిరించి పాపం ముసలి!
ఆకలినాలుకలన్నీ ఏకమైనరోజున..
ఆకలి నాలుకలన్నీ
ఏకంగాముందుకు సాగినరోజున
—సంశయ మెందుకు?
ఆరోజున విజయం ఎవరిది??
  ఆకలి నాలుకలన్నీ
  అరచి అరచి,
  ప్రళయంవలె గర్జిస్తాయి!
  శ్రమనెరుగని శ్రీమంతుల
  కర్కశ పరిపాలనను
  అజేయమై ఎదిరిస్తాయి"

పేదల కష్టాలను,
శ్రమజీవుల స్వేదం బిందువులను,
నాణెములకు మార్చుకొనే
కలవారల, కండకావరుల
కర్కశ పరిపాలనను
పగతీరా బ్రద్దలు చేస్తాయి!
విరామ మెరుగని ప్రగతీరావంతో
ఆకలి నాలుకలన్నీ నినదిస్తాయి!!
పాపం! చరిత్ర ముసలి
ఏదో తలపోస్తోంది!
కాలగతిని పరిశీలిస్తూ,
క్రాంతి తరంగాలను చూస్తూ
పాపం! చరిత్ర ముసలి
పిరికి గుండె వలె బేజారయింది!
ఆకలి నాలుకలన్నీ
ఏకంగా ఉప్పెనలా ఉప్పొంగుచు
దుశ్శాసన రాజ్యంలో...
ధనస్వామ్య కఠోరపరిపాలనలో
కుబేర దుర్గాలను
గుభిల్లు గుభిల్లుమని కూలుస్తున్నవి!
కుబేరలోకం సమాధిపై
పేదజనుల కుచేల లోకం...
కోటికోట్ల గొంతులెత్తి
స్వామ్యజగతి స్వాగత సంగీతం
ఆలాపిస్తున్నది!!
కల్లోలిత జనసందోహం చూస్తూ
గజగజ వణికెను భీతికి,
చరిత్ర ముసలి పాపం!
కోలాహల స్వాగత గీతికి
కొత్తగాలి పిల్చుతోంది!!
జీరపడిన ముసలిగొంతు
లోలోపల సణుగుతోంది:
"ఓ హోహో స్వప్నం కాదుకదా
ఎంతలోనె ఎంతమార్పు!"
ఆకలి నాలుకలన్నీ
ఏకమైన రోజున...
ఆకలి నాలుకలన్నీ
ఏకంగా ఉప్పెనలా
ఉప్పొంగిన ఈరోజున...
ధనస్వామ్య కఠోరపరిపాలన,
ఛిన్నాభిన్నంగా నుసినుసిగా
నశించి పోతున్నది!!
పేదజనుల కుచేలలోకపు
ప్రతీకార జ్వాలల్లో...
దుశ్శాసన కర్కశ పరిపాలన
పటాపంచలై భస్మీపటలమై
నశించి పోతున్నది!
మంత్రసాని చరిత్ర ముసలి
'కాలగతి'కి - గర్భవతికి,
పురిటినీళ్లు పోస్తోంది!
ప్రభవించే నూతన జగతికి
—పురిటి బిడ్డ - 'సమధర్మా'నికి
పురిటినీళ్లు పోస్తున్నది,
'చరిత్ర'మంత్రసాని ముసలి!

* పర్చా దుర్గా ప్రసాదరావు *

# కదిలిన పునాదులు!



భారత దేశంలో యెక్కడా జరగని పరిణామం యిక్కడ జరుగుతోంది — తెలంగాణాలో. దేశానికంతకీ వెనకపడ్డ ప్రాంతం యిదే; ముందుకు నడుస్తోందీయిదే.

అమెరికన్ పత్రిక Life, సోవియట్ పత్రిక New Times, ఒకటి తరవాత వొకటి తిప్పేసి సిగరెట్టు పీల్చాడు రమణరావు.

రమణరావు "గెలుపుమనదే" అనే జాడ్యానికి లొంగిన దీర్ఘరోగి.

"గెలుపు నైజాందే" అంటూ నిరాశపడే దేశభక్తులూ "గెలుపు నైజాందే" అంటో కాశింరజ్వీ వెంట తిరిగే దేశద్రోహులూ, సుబ్బారావులూ, సీతారామయ్యలూ రమణరావును తమవైపు తిప్పుకోవాలని చూశారు.

"ఒరేయ్! రమణ్! నీకు తుపాకీ పట్టడం చాతకాదు. కొండల్లో

9

ఉండడం రాదు. గుండు దెబ్బలకు తాళుకోవడం చాతకాదు. యెందుకీ చింత? పోతే కాందిశీకుడుగా యూనియన్ ప్రాంతానికి పారిపోయి పెళ్లాంమెళ్లో పుస్తెలమ్ముకుని కొన్ని నెల్లు బ్రతికి ఆతరవాత కృష్ణలోపడి చావాలి లేదా గొరిల్లాల వెంట తెలంగాణా కొండల్లో భయానక జీవితం గడుపుతో యేపామో మింగితే పడిపోవాలి. "గెలుపు మనదనే" వా వేరే ఆల్టర్నేటివ్ లేదు. ఎందుకిమూర్ఖం? హైద్రాబాద్ నగరం, మేడలూ Grand Hotel, పారమౌంట్, ప్లాజా థియేటర్లూ, "నజర్" అనే ఉరుదూ కవితో తాగుతో తిరగడాలూ వదిలేసి యిదేంఖర్మ?" అన్నాడు సుబ్బారావు.

• ప్రస్తుత చరిత్ర

వాడి కుచ్చుల ఉచ్చులో రమణ్ పడిపోతాడని నేననుకోలేదు. కాని బాధల్ని భరించ గలడా? అని ఆలోచించాను

యూనియన్ ప్రాంతాల్లో యెవడూ గంజెనా పోయడు. ఏ వుద్యోగమూ లభించదు. వుంటానికి ఇల్లు కావాలంటే మోయలేనంత అద్దె.

యీ కల్లోలంలో రమణ్ మాట కొన్ని నెలలదాకా వినిపించ లేదు. మేమంతా జైళ్లకు వెళ్లాం కొన్నాళ్లకు వచ్చేశాం. వచ్చేశాక మేమూ పై రెండుమార్గాల్లో యేదోఒకటి వెతుక్కోవలసి వచ్చింది. కాందిశీకత్వమా? రహస్య జీవనమా?

మా మొండిఘటం రహస్య జీవనం వైపు నడిచింది. వరంగల్లు పల్లెల్లో, అడవుల్లో, కొండల్లో రోజులు నడుస్తున్నాయి.

మధ్యయుగాల దోపిడీలో బొర్రలుపెంచిన జాగీర్దార్లు, జమీందార్లు, షావుకార్లు, బ్రాహ్మణులూ, మతకర్తలూ, దొంగ పండితులూ వీళ్లతో తెలంగాణా పేదలు; యువకులు, మధ్యతరగతి ప్రజలు నుసినుసి అయిన రోజుల్లో నాజీవితంవ్యక్తిత్వాన్ని పొందింది.

లక్షా యాభైవేల యెకరాల భూమికి ఒక్కడే ప్రభువు! అంత చోటులో నివాసంవున్న వేల జనం వాడి బానిసలు పైగా జాగీర్లు. వాళ్లకి సివిల్ క్రిమినల్ అధికారాలు జాగీర్లు తమస్వంత కోర్టులలో విచారించి యెవణ్ణయినా హింసించవచ్చు. జాగీర్దార్ల స్వంత పోలీసు యేదిపడితే అది చేయవచ్చు. ఇంగ్లీషు పరిపాలన నాడుకూడా భారత దేశంలో జాగీరుదార్లకు ఇలాంటి అధికారాలు లేవు. కాని నైజాంలో ఇవన్నీ చిరకాలం నించి సాగుతున్నాయి.

వెట్టిచాకిరీ చేయించుకోని ఉద్యోగి, దొర, కరణం లేనేలేడు.

కాంగ్రెసు, కమ్యూనిస్టు అంటూ బహిరంగంగా రంగంలోకి వచ్చింది ఈ రెండుమూడేళ్ల నించే. అంతకుముందు అన్నీ నిషేధమే. ఇప్పుడు మళ్లీనిర్బంధాలు! ప్రజోద్యమాలు అనేకసార్లు తునిగిపోయి మళ్లీ మళ్లీ మొలిచినై.

రజస్వలానంతరం వివాహం చేయడానికి ఇవాళటిదాకా నైజాంలో సాహసించిన గౌరవ కుటుంబం లేదుకదా? అస్పృశ్యత పిశాచంలా భయానకంగా వ్యాపించి వుంది.

అభివృద్ధి భావాలుగల కొడుకుల్ని తండ్రులు అధః పాతాళానికి తొక్కారు.

గతాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటే నైజాంలో ద్రోహులకి తప్పితే మంచాడికి బ్రతుకే లేదు, ప్రజాస్వామిక రాజకీయ పక్షాలకి నివాసం లేదు. కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు ప్రతివాడూ ప్రభుత్వ దౌర్జన్యానికి గురి కావలసిందే. కవికీ, గాయకుడికీ సైతం నిర్బంధం తప్పదు.

నైజాం పిశాచానికి పూజలు చేసి రక్తం తాగించి మూల్గులు తినిపించే దొంగలు నైజాం ప్రజల్ని పీల్చుకున్నారు. ఈ రెడ్డి దొరలు, ఈ కరణాలు మనుష్య మాత్రుణ్ణల్లా తిన్నారు. మేడలు, దేవిడీలు, దివాణాలు, గడీలు ప్యాలెసులు, బంగాళాలు, కోఠీలు కట్టించుకున్నారు.

పదిహేను 'ఆగస్టు 47' హైద్రాబాదు ప్రజలపాలిటి దివ్య దినం. నైజాం పిశాచం మీద సవాల్ చేసింది జనం. మూడురంగుల జండా కింగ్ కోఠీ వైపు నడుస్తుంటే యెఱ్ఱజండాలు దివాణాలమీదికీ, గడీలమీదికీ కదిలాయి.

లక్షాయాభై వేల యెకరాల జమీందారు కింగ్ కోఠీ నీడలో కూచున్నాడు. హైద్రాబాదులో భూమంతా జనం పంచుకున్నారు.

ఒరే! విసునూరి దొరా! ఇప్పుడురా! నీవూరికిరా! నీ ఇల్లు లేదు, భూమీ లేదు..

. జన్నారెడ్డీ, యేదీ నీ భూమి?

దివాణాలు వాలిపోయినై. బంగాళాలు కూలిపోయినై. మధ్యయుగాల దోపిడీకి 'సింబల్'గా నిలబడివున్న యేవస్తువూ మిగలదు; మిగల్లేదు. ఆ మధ్యే కింగ్ కోఠీ గోడ ఒకమూల పేలిందికూడా.

(మిగతా 80వ పేజీలో)

# నీలి మంటలు



ప్రవేశం :

చంద్రుడు విడాకులిచ్చిన
ఈ రోజున—
ఆకాశం అరుగుమీద
గుంపులుగా కూడి
తారలు—
ఏదో చర్చిస్తున్నయ్.
నిశీధ శిఖరాలు
కప్పిన క్రోధం—
కరిగి జాలువారుతోంది.
నిశాచరులు
నిరంకుశులు—
తీరని కోరికల
కొండలు ఎక్కుతోన్న
పుణ్యకాలం ఇది.
అజ్ఞానం విత్తిన
పరి పాలకులు—
పండిన పంటలు
నూరుస్తున్నారు.
మానవులను
వేటాడను—
నియ న్తలు
ప్రభుత్వ మనే
రేచు కుక్కల కళ్ళెం
వదిలిన రామరాజ్యం ఇది.
చలికి వణుకుతోన్న
శ్రీ మాతుల
చలి మంటలు—
విరిగిన బ్రతుకులు !
భూగోళం—
కన్నీళ్ళ కడవగా
పగిలి ప్రవహిస్తోంది.
ఆకాశం—
అగ్నులు కురుస్తోంది.
ఏడు సంద్రాలు
ఏకంగా
ఏడుస్తున్నయ్
నెత్తుటిదాహం
తీరని ప్రస్తుతం -
క్రూర మృగంలా
విక్రమించింది.
కమురుకంపు
కొడుతోన్న లోకం
నీలిమంటలు కక్కుతోంద.

ధ్వని:

జరిగిన,
జరిగే
న్యాయం ఇక సాగదు -
రాజ్యం ఇక చెల్లదు
ఇది అడ్డుకట్ట
ఇది ఆనకట్ట
ఇది అలంఘ్యం -
ఇది అభేధ్యం

కవి:

నేనువాక్కును!
కొత్తకాంతిని!
కొత్తశక్తిని!
సకల ప్రజలకంఠం
నేను!
సమస్తదీనుల
హీనుల -
ఒకేగొంతును!
దరిద్రం నాకన్నతల్లి!
తిరుగుబాటు
నాతో బుట్టువు!
ప్రభవించే మరోజగతి
నాయిల్లు!

అపశ్రుతి:

నాబళ్ళోలిచిన
నాకళ్లుతోడిన
లోకం కథ
చెప్పుకవీ!
నా మేధస్సు నెమరేసిన
నా ఎముకలు కొరికిన
నరరాబందుల గోరీ
త్రవ్వు కవీ!
నన్ను గూర్చి
మహా కవిత వ్రాయి కవీ!

కవి:

నా అక్షర లక్షలు -
కష్టాల కాష్టంపై
నడిచే పరాధీనులు
విడిచే నిశ్వాసాలు!
బాధల చితిపై
బ్రతుకుతోన్న బానిసలు
వ్రాసే వీలు నామాలు!
ఒరిగే వీరవరుల
స్మృతి చిహ్నంగా
రాలే నక్షత్రాలు!
విషాదాలు విషాగా
త్రాగే నవ కవుల
శోక శ్లోకాలు!

## అపస్వరం:

ప్రజా పుత్ర
ప్రజా కవీ!
చల్లని నాచేతులతో
నీ మార్గంలో
మల్లెలు పోస్తా!
నర రక్తం బ్రాందీగా
నర చర్మం తివాసీగా
చేసి-జల్సాచేసే
కిరాతకుల చావు
కథలు చెప్పు కవీ!

## కవి:

క్రాంతిని వరిస్తాను!
శాంతిని వచిస్తాను!
అసత్యాలను హతంచేస్తా!
సత్యాలను త్రవ్వి తీస్తా!
సమాజంపై -
భీభత్స సమాజంపై
సమరం ప్రకటిస్తా!
మనుష్యులను చదువుకోని
మానవులను రచిస్తాను!

## అపస్వరాలు:

మాగుండెలు
పచ్చిపుండ్లు!
మా బ్రతుకులు
శిలువెక్కిన
జీసస్‌లు!
మాకాంక్షలు
తెగనరికిన
నందనాలు!
మా ఇంట్లోదీపం
ప్రతీకార బడబాగ్ని!
మా గుండెల రక్తం
పగలెగసే తప్తధార!

## కవి:

సింహంలా విక్రమించిన
మహాప్రజ
నా సబ్జక్ట్!
ఎర్రగన్నేరు హారంతో
ఊరేగే దొరలగుంపు
నా ఆబ్జక్ట్!
పాలకుల గుండెలు
నమిలే బులెట్స్
నామాటలు!
పలికిల కండలు

కరిచే బాయునెట్స్
నాపాటలు!
సింహాసనాల
కూల్చే శతఘ్నులు
నాఊహాలు!
బలిపీఠాలు
పగిల్చే బాంబర్లు
నా వాక్కులు!
శత్రుసంహార యాత్రలు
స్వాస్వేచరిత్రలు!
పోలి చల్లిన రాత్రులు
నావిహార యాత్రలు!

## విషాద కంఠాలు:

చిగిర్చని
ఆశాలతలు
పరచుకొని
పయ్యనిస్తున్నాం!
ఎర్రని
ఆకలి కడుపులు
కప్పుకొని
పడుకున్నాం!
కలవారి
మేడచుట్టూ
కండ్లు మూసు
కుంటున్నాం!

## కవి సందేశం:

చిరిగిన సహోదరీ!
చితికిన సహోదరా!
సకిలించిన సంగ్రామం
గర్జించిన తుది సమరం -
దోసెడు రక్తాక్షితలు
చారెడు నెత్తుటి గంధం
తెచ్చా యిదే పుచ్చుకోండి!

## ఒక కంఠం:

దోపిడ్మాగా
దొంగలుగా
మము దోచిన
మము పీల్చిన
నర హంతల్లారా!
నడవండిక!
మీరు కట్టించిన
కారాగారాలకు -
కనిపెట్టిన
ప్రవాసాలకు -
మీ పైబట్టలె
మీపై పగబట్టిన
పాములు!
మీరెత్తిన
ఉరికొయ్యలు
మీకుత్తుకకే

ఉరిఉచ్చులు !
మీరిచ్చిన
మరఫిరంగులు
మీ రొమ్ములకే
బారుకావె !
అడుగడుగూ
అగాధమై
అగడ్తలై
అనల్పసహస్రాలై
మీ ప్రాణాలను
బలిగా
పోలిగా
కోరుతున్నయ్ !

## విప్లవకంఠాలు :

రారాజుల కిరీటాలు
మా దారికి సోపానాలు !

కడ యుద్ధంబడిలో
విశ్రమించు యోధులు
మా రాస్తాపై మైలురాళ్లు !
నెత్తురు పారిన నేలలు
ఎత్తిన పంటలం మేం !
విలయాలు వరిస్తాం !
ప్రళయాలు కురిపిస్తాం !

## సమాప్తం :

ఎర్రబడ్డ
తూరుపుకొండలు
దిగద్రాగిన
నీలిమంటలు !
కనుచూపు మేరలో
కనీ లేకాటిమంటలు !
చీకటి రాకసిపాలన
చెరిపిన నీలిమంటలు !

---

" ఒకరచయిత తన రచనకై స్వీకరించిన యితివృత్తమే అతని రచనాశక్తికి చక్కటి గీటురాయిగా భావించాల్సిన కాలం వచ్చింది."

బార్బరా గైల్స

---

# ముగ్గురు ఖైదీలు



తలుపుకూ కిటికీకి మధ్య ఏడడుగులు. మళ్ళీ కిటికీనుంచి తలుపువరకూ ఏడడుగులు. ఇది నాకు కంఠోపాఠమైపోయింది.

ఈ పాంక్రాస్ జైలులో, ఈ గదిలో, పైన్ చెక్కలతో అమర్చిన ఈ నేల మీదనే అటూ ఇటూ ఎన్నిసార్లు పచారుచేశానో! నన జాతి భవిష్యత్తును గుప్పిట పెట్టుకున్న నాజీవాదుల విధ్వంసక పంథాను స్పష్టంగా గ్రహించడంవల్లనే - ఇవాళ ఖైదులో చిక్కాను. ఇప్పుడు నా జాతిని బలికి సిద్ధంగా శిలువమీద నాటారు; నా గది ముందు ఒక నాజీ పహారా కాస్తున్నాడు; ఎక్కడో దూరంగా కూచుని రాజకీయ దుష్టబుద్ధులు దేశద్రోహానికి కుట్రపన్నుతున్నారు. మానవులు కళ్ళు తెరవడానికి ఎన్ని శతాబ్దాలు పడుతుందో! మానవజాతి ఎన్ని చెరసాలల్ని ఛేదించుకుంటూ ముందడుగు వెయ్యవలసివచ్చిందో! ఇంకా ఎన్ని దాటాలో! ఓ భగవంతుడా! మానవుని విముక్తి మార్గానికి అవధి అనేది వుందా? కాని. చిట్టచివరికి మానవుడు మేల్కొన్నాడు! ఇప్పటికి మేలుకున్నాడు!

ఏడడుగులు ముందుకు: ఏడడుగులు వెనక్కి! ఒక గోడపక్కనే మడత మంచం, మరొక గోడకు చేరువగా అలమరా, ముంతా మొదలైనవి. అవును; అన్నీ అలాగే వుంటాయి. ఖైదులన్నీ యంత్రాలతో అమర్చారిప్పుడు. ఉష్ణ ప్రసారమూ, పాకీకొడ్డి అన్నీ యంత్రాలతోనే - ఖైదీలుగూడా యంత్రపరికరాల్లాగా తయారైనారు, ఒకమీట నొక్కితే చాలు తాళం చెవి తిరిగి, తలుపు తెరుస్తుంది. లేదా గవాక్షం గదిలోకి తెరుచుకుంటుంది. వెంటనే ఖైదీలు ఏం చేస్తున్నా సరే చివాలున లేచి ఒకరివెనుకఒకరు పంక్తిగా నిలబడతారు. తలుపులు తెరుచుకోవడంతోటే గదిలోవున్న వృద్ధఖైదీ ఒక కేక పెడతాడు.

“ఎటెన్షన్! సెల్ 267 ముగ్గురు ఖైదీలు! అంతా ఆర్డరులోనే వుంది.”

మాది 267 నం. గది. అయినా ఇవాళ అంతా ఆర్డరులో లేదు. ఇద్దరు మాత్రమే లేచి నిలబడ్డారు. కిటికీ దగ్గర చిరిచాపమీద నిశ్చలంగా పడుకున్నాను - ఒక వారం.

అనువాదం:

• అనిశెట్టి సుబ్బారావు •

రెండు వారాలు, ఒక నెల, ఆరువారాలుగా ఇలాగే బోర్లపడుకున్నాను. ఇప్పుడే మళ్లీ కొత్త జన్మ యెత్తుతున్నాను. అప్పుడే నేను తల కదిలించగలను, చెయ్యి పైకెత్తగలను మోచేతిమీద పైకి లేచాను కొద్దిగా, వెనక్కి తిరిగి పడుకోవాలని ప్రయత్నించాను కూడా. కాని, అప్పటికంటె యిప్పుడు కొంచెం త్వరగానే వ్రాయగలను సుమా!

మా గదిలో కొన్ని మార్పులు జరిగాయి. తలుపుమీద ఖైదీల జాబితాలో రెండే పేర్లున్నాయి. అందరికంటె చిన్నవాడు కారెక్ అదృశ్యమైనాడు. అతనూ, ఈ వృద్ధుడూ కలిసి, నేను చనిపోయాననుకుని మరణ గీతాలాలపించారు. అతని జాలిగుండె మీది ప్రేమతప్ప మాకు మిగిలిందేమీ లేదిప్పుడు. నాకు కలవరింతల్లో, కలల్లోతప్ప అతన్ని గురించి స్ఫురణే లేదు - అదీ ఆ చివరి రెండు రోజుల్లోనే. అతని కేసును గురించే పదే పదే వివరాలతో సహా చెప్పుకొచ్చేవాడు-ఆ చరిత్ర పూర్తికాకముందే నిద్రవచ్చేది.

అతని పేరు కారెక్ మాలెక్. హురాలిజ్ ప్రాంతంలో ఇనుపగనిలో 'కేజ్' దగ్గర మెకానిక్‌గా పని చేసేవాడు. అరెస్టయి రెండేళ్ళయింది, బహుశా ఇప్పుడు విచారణకోసం బెర్లిన్ తీసుకుపోతున్నారేమో! అతనితో ఒక గ్రూప్ మొత్తాన్ని తీసుకుపోతున్నారు. ఏం శిక్ష వేస్తారో! భార్య, ఇద్దరు పిల్లలూ...వాళ్ళను ఎంత ప్రేమిస్తాడో చెప్పలేను! ఎంత గాఢమైన ప్రేమ!!

నా పక్కమీద కూచుని తిండి తినిపించాలని ప్రయత్నించేవాడు. తినలేను. శనివారంనాడు - అప్పుడే ఇక్కడికొచ్చి ఎనిమిది రోజులైందా? - ఒక కొత్త ఎత్తువేసి నేనిక్కడున్నా న్నాళ్ళూ అసలు ఎంగిలైనా పడలేదని జైలు అధికారిక్కి రిపోర్టు చేశాడు. అతని అనుమతి లేనిదే చెక్ డాక్టరు రోగులకు ఆస్పిరిన్ కూడా ఇవ్వలేడు. వెంటనే ఆ అధికారి నాజీ యూనిఫాం వేసుకుని, చద్దిపులుసు లోటాపట్టుకొని వచ్చి పక్కనే నిలబడి నేను తాగేదాకా వదిలిపెట్టలేదు. బలవంతంచేసయినా సరే తాగించగలిగాను గదా అని కారెక్ తృప్తిపడ్డాడు. ఆదివారంనాడు తనే స్వయంగా పులుసులోటా నా నోట్లో కుమ్మరించాడు.

అంతకంటె ఎక్కువ మాత్రం నాకు మింగుడు పడటంలేదు. చిగుళ్ళు బద్దలుగా పగిలి, మెత్తగా వుడికిన బంగాళాదుంపల్ని గూడా నమలనియ్యడంలేదు గొంతు బాగా వాచిపోయి గోరుముద్దల్ని గూడా మింగుడు పడనియ్యదు.

"చారుగూడా తాగటంలేదు. పట్టిచారుగూడా వద్దంటున్నాడు" అని కారెక్ ఆందోళన పడుతూ తల తిప్పుతున్నాడు. తర్వాత నా భోజనాన్ని చెరిసగం పంచుకుని "తాత", తను, తినేవారు.

మిత్రమా! నువ్వు 1942 లో పాంక్రాస్ జైల్లో లేవుగదూ? ఐతే అక్కడి చారు రుచి ఎలా వుంటుందో నీకు తెలియదు! నువ్వెన్నడూ గ్రహించలేదంటే నమ్ము! ఆ దుస్సహమైన పరిస్థితుల్లో - ఆకలితో కడుపులో ప్రేగులు కేకలుపెట్టేవి, వారాని

కొకసారిచేసే స్నానానికి వెళ్ళితే చర్మంతో కప్పిన అస్థిపంజరాలని నిలబెట్టినట్టుండేది, నీకు అతిప్రియమైన మిత్రుడు చేతులతో కాకపోతే కళ్ళతోనైనా నీ భోజనాన్ని దొంగిలించేవాడు. పూర్తిగా ఎండిపోయిన కూరగాయలు, వొట్టి నీళ్లు కలిపిన రొమ్ముల కాకాయలూ కూరవండితే - ఎంత అసహ్యం! - అదే పరమాన్నంలాగుండేది. దుర్భరమైన ఆ రోజుల్లోనే వారానికి రెండుసార్లు - గురు, ఆదివారాల్లో - మా ముంతుల్లో బంగాళాదుంప ముక్కలు, దాంట్లో వాసనకోసం వేసినట్టు ఒక చెంచా మాంసం పులుసు, పంటికిందికి రెండు మాంసపుముక్కలూ వేసేవారు. ఆరుచి అద్భుతంగాతోచేది. రుచికంటెగూడా, మేమొకప్పుడు మానవజీవితం గడిపినవాళ్ళమేనని, నాగరికులమేనని జ్ఞాపకంవచ్చి, ఆ నాజీ నరకంలో బైట మా జీవితాన్ని మళ్ళీ చవిజూచి ట్లనిపించి పరవశమయ్యేవాళ్ళం. దాన్నిగురించి మాట్లాడితేనే తన్మయులమయ్యేవాళ్ళం. ఏక్షణంలో చావుమూడుతుందోనని హడలిపోతున్న ఖైదీలకు మానవత్వశిఖరాలను సువ్యక్తం చెయ్యడానికీ మాంసంపులుసు ఎలా ఉపయోగపడుతుందో ఎవరు గ్రహించగలరు!

నేను పులుసుగూడా ముట్టకపోతే పాపం! కరెక్ ఎందుకు భయపడేవాడో నాకు రెండు నెలలతర్వాతగాని అంతుపట్టలేదు. నాకు చావు సమీపిస్తున్నదనడానికి, పులుసుకూడా తాగకపోవడంకంటె వేరే ప్రమాణం అక్కరలేకపోయింది.

మరునాటిరాత్రి రెండు గంటలవేళకి వాళ్ళు టకటకవచ్చి కరెక్‌ను నిద్రలేపారు. అతను ఐదు నిమిషాల్లో తయారుకావాలిట. వాళ్ళ ఆర్డర్ చూస్తే ఏదో వెంటనే తిరిగి రావడానికి బైటికి విడుతున్నట్టుంది. కాని, జీవితాంతానికి ప్రయాణం ప్రారంభిస్తున్నట్టు, మరొక ఖైదుకో, కాన్సెంట్రేషన్ క్యాంపుకో, ఉరికంబాలకో - ఎక్కడికో ఎవరికి తెలుస్తుంది! - సిద్ధమై కడసారిగా వెళ్ళిపోతున్నట్టులేదు. ఈలోపలే అతను నాపక్క దగ్గర మోకాళ్ళమీదకొంగి, నా శిరస్సును తన రెండుచేతుల్లోనూ నింపుకుని ముద్దుపెట్టుకున్నాడు. అంతలోనే వరండాలో యూనిఫాం వేసుకుని తిరిగే గార్డు, పాంక్రాస్ జైల్లో గౌరవప్రేమలకు స్థానంలేదంటూ మొరటుగా చప్పట్లుకొడుతున్నాడు. కరెక్ చరచర బైటికివెళిపోయాడు. తాళంపడింది. మళ్ళీ... గదిలో ఇద్దరమే మిగిలాం.

ఏమోయ్! మనం ఎప్పటికైనా కలుసుకుంటామా మళ్ళీ? ఈసారి మాఇద్దరిలో ఎవరు బయలుదేరుతారో? ఎక్కడికో? మాకోసం ఎవరొస్తారో? యస్. యస్. యూనిఫాం వేసుకున్న సైనికుడే వస్తాడో, యూనిఫాం వేసుకోని చావే వస్తుందో!

ఖైదులో మేమిచ్చుకున్న మొట్టమొదటి వీడ్కోలు సమయాలో వచ్చిన ఆలోచనలింకా నా స్మృతిలో వున్నాయి. ఈ పంక్తులిప్పుడు వ్రాస్తూంటే వాటి ప్రతిధ్వనులింకా నాకు విన్పిస్తున్నాయి. అది జరిగి ఇప్పటికి ఒక సంవత్సరం గడిచింది. యీ ఆలోచనలే అనేకమంది అలా వెళ్లిపోతున్నప్పుడు పదే పదే అంతకంటె తీవ్రంగా నన్ను బాధించాయి. మా గది తలుపుమీదవున్న రెండుపేర్లు - ఖైదీల జాబితా - మూడైనాయి

కరక్ వెళిపోగానే మళ్ళీ రెండే. తర్వాత మళ్ళీ మూడు, రెండు, మూడు, రెండు: కొత్తవాళ్లు వచ్చి కలిశారు. వెళిపోయాడు ఆ గదిలో మొదట్నుంచీవున్న మేమిద్దరమే మిగిలాం చివరికి.

"తాత", నేనూ.

"తాత" వయస్సు అరవయ్యేళ్ళు. ఆరెస్టయిన టీచర్లందరిలోనూ అతను వృద్ధుడు. పేరు జోసెఫ్ సెషెక్. అతన్ని నాకంటె ఎనభైయైదురోజులుముందే "జర్మన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రపన్నాడ"నే నేరం మోపి అరెస్టు చేశారు. జెక్ దేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత విద్యావిధానాన్ని ఎలా బాగుచెయ్యాలో అంటూ ఒక ప్లాను వేశాడ నేది అతను చేసిన మహాపరాధం.

"తాత" యింకా...

కాని, ఎంతని వ్రాయను? నిండా ఒక సంవత్సరం ఇద్దరమూ కలిసి జైలులో గడిపిన తర్వాత ఒకరిని గురించి ఒకరు వ్రాయడం ఎంతఅసంభవమౌతుంది! ఈ లోపల "తాత" పేరుకు అటుయిటూ కొత్తరోజుల్లో పెట్టిన కొలన్ మార్కులు తొలగిపోయాయి వయస్సులోవున్న తేడాతోపాటు నిజంగా "తాత" మనుమళ్లలాగే ప్రవర్తిస్తున్నాం. ప్రతినిత్యమూ ఇద్దరం ఉపయోగించే ఊతపదాలు, సౌంజ్ఞలు మొదలైనవన్నీ అలవాటైపోయి అతి సహజంగా కన్పిస్తున్నాయి. ఇప్పుడు గదిలోవున్న వస్తువుల్లో అతని వేవో, నా వేవో కూడా భేదం తెలియడంలేదు.

ప్రతిరాత్రీ విసుగూ విరామం లేకుండా నా పక్క దగ్గర కూచుని, రెండు చేతులతోనూ దూది పుచ్చుకుని గాయాలు తుడుస్తూ క్షణ క్షణం సమీపిస్తున్న భయంకర మృత్యువునే పారదోలగొట్టేవాడు. గాయాల్లో చీమూ, మైలా ఎంతో ఓపికతో శుభ్రం చేస్తూ, నా పక్కచుట్టూ కమ్ముకున్న అసహ్యమైన దుర్వాసనకు రవంతైనా బాధపడేవాడు కాదు. నా చొక్కాని జాగ్రత్తగా వుతికేవాడు. చినిగితే అతుకులు వేసేవాడు. మరీ నిష్ప్రయోజనమై పోతే తనదే ఒకటి తెచ్చి తొడిగేవాడు. ఒకనాటి ఉదయం తను రోజూ జైలు ఆవరణలో కసరత్తుచేసే వ్యవధిలో నా కోసం- ప్రాణాలకి తెగించి- ఒక చిన్న మల్లెపువ్వూ, కొద్దిగా గడ్డిపరకలూ సంపాదించి తెచ్చాడు. "విచారణ" నెపంతో నన్ను అధికారులు బైటికితీసుకొనిపోయినప్పుడల్లా వెడుతున్నంత దూరం నా వంక జాలిగా చూసేవాడు. మళ్లీ తిరిగి రాగానే నేను కొత్తగా తెచ్చుకున్న గాయాలన్నిటినీ అతి సున్నితంగా దూదితో తుడిచేవాడు. రాత్రి వేళ తీసుకుపోతే నేను వచ్చేవరకూ అలాగే రెప్పవాల్చకుండా కనిపెట్టుకొని వుండి, నేను వచ్చినతర్వాత పక్కమీద పడుకోబెట్టి దుప్పటి కప్పి అప్పుడు తను నిద్రపోయేవాడు

మొదటిరోజున ఇద్దరమూ అనుభవించిన యమయాతనలతో ప్రారంభమైన ఈ మైత్రి చివరివరకూ నిరాటంకంగా కొనసాగింది. ఆ తర్వాత క్రమక్రమంగా అతని సేవకు ఒరులుతీర్చుకుంటూ వచ్చాను

ఐతే, ఏమోయ్ ఫ్యూజిక్! ఒక్కసారి కూచుని ఆ చరిత్రంతా వ్రాయగలవా? మా గదిలో ఆయేను అనేక అద్భుతాలు జరిగాయి. తాతగూడా తనకు తోచిన పద్ధతిలో, వాటన్నిటిలోనూ పాల్గొన్నాడు. కాని, ఇంకా కథ సమాప్తం కాలేదు - ఇంకా ఆశ ధ్వనిస్తోనేవుంది.

ఈ గదిలో అనేక అద్భుతాలు జరిగాయి. ఒక్కొక్కసారి తలుపు తెరిచి గంట గంటకూ సోదా చేసేవాళ్ళు. ఇందులో వున్న కమ్యూనిస్టు ముద్దాయిని బహుజాగ్రత్తగా కాపలా కాయాలని వాళ్ళకి ఆర్డరుండడమేగాదు, లోపల ఏం జరుగుతున్నదో చూడాలనే ఆతురతగూడా కొంత కారణమే. ఎప్పుడూ మేం కలలోగూడా అనుకోని మనుష్యులు హఠాత్తుగా చనిపోయేవారు. కాని, చనిపోతారనుకున్న మనుష్యులు బ్రతకటం మాత్రం ఎప్పుడూ లేదు. పక్కపక్కనేవున్న వరండాలలోంచి పెద్దగా కేకలువేసుకుంటూ గార్డులు మా గదిలోకొచ్చేవాళ్ళు. నిశ్శబ్దంగా నా దుప్పటిఎత్తి గాయాలెలావున్నాయో చూసేవారు. వాళ్ళవాళ్ళ తత్వాలనుబట్టి వెంటనే వెకిలిగా నవ్వడమో స్నేహపూర్వకంగా పలకరించడమో చేసేవారు. అందులో మేం స్మార్టీ అని పిలిచే ఒకతను అమాయికంగా నవ్వుకుంటూ వీలైనన్ని సార్లు లోపలికొస్తూ "ఆ 'రెడ్ డెవిల్' కేమైనా కావాలా?" అని అడిగేవాడు. వద్దుబాబూ, నీకొక నమస్కారం. వద్దు. కొద్దిరోజులతర్వాత ఈ "రెడ్ డెవిల్" క్షవరం చేయించుకోవాలని తెలుసుకునే వాడు స్మార్టీ. వెంటనే మంగలిని వెంటబెట్టుకొచ్చేవాడు.

మా గదిలో వాళ్ళకు మొట్టమొదటి సారిగా పరిచయమైన బైటి ఖైదీ కామ్రేడ్ బోచెక్. సదుద్దేశంతో చేసినా ఈ స్మార్టీ సహాయం నన్ను క్రూరంగా బాధిస్తోంది. తాత నా తల తన చేతుల్లో పట్టుకుంటే బోచెక్ ఒక మొద్దుకత్తితో గడ్డం చెయ్యటం మొదలెడతాడు. మంగలి, పాపం! అతని వేళ్ళు వొణుకుతున్నాయి. అతని కళ్ళనిండా నీళ్ళు కమ్ముతున్నాయి. అతనికి తాను క్షౌరం చేస్తున్నది శవానికిగాని మనిషికిగాదని గట్టిగా నమ్మకం కుదురుతుంది. ఇంకా బ్రతికేవున్నానని ఏదోలాగ సౌంజ్ఞ చేస్తాను నేను.

"ధైర్యంగా వుండు, మిత్రమా! పెచెక్ భవనంలో చిత్రహింసని భరించగలిగిన వాణ్ణి నీ క్షౌరం బాధని సహించలేనూ?" కాని, అతి బలహీనస్థితిలో వున్నాం. అందుచేత ఇద్దరం విశ్రాంతి తీసుకోకతప్పదు. అతనూ, నేనూ. రెండు రోజులు గడిచి, మరి ఇద్దరి ఖైదీలతో నాకు పరిచయం కలిగింది. పెచెక్ భవనంలో విచారణచేసేపోలీసు అధికారులకు ఆతృత హెచ్చింది. వాళ్ళు ఎంత గట్టిగా పట్టుబట్టినా జైలు ఉద్యోగి ఒక చీటీమీద "ప్రయాణం చెయ్యలేడు" అని వ్రాసి పంపేవాడు. అందుచేత ఈమాటు ఎలావున్నా సరే పంపవలసిందేనని ఆజ్ఞాపించారు. ఇద్దరు ఖైదీలు నన్ను మోసుకుపోవడానికి సిద్ధంగా వచ్చి స్ట్రెచర్‌తో గదిముందు నిలబడ్డారు. నాకు బట్టలు తొడిగించటానికి తాత నానా అవస్థలుపడ్డాడు. నన్ను స్ట్రెచర్ మీద పడుకోబెట్టి ఇద్దరూమోస్తున్నారు.

మా గదుల వరుసలోవున్న ఖైదీలందరికంటే మెత్తనివాడూ, వృద్ధుడూ కామ్రేడ్ స్కొరెపా అందులో ఒకడు. రెండవ ఖైదీ... నేను పక్కకి జారిపోబోతుంటే నా చెవిదగ్గరగా నోరుపెట్టి "పట్టు వదలొద్దు" అంటున్నాడు.

ఇంకా రహస్యంగా "అన్నివిధాలా; పట్టువదలొద్దు సుమా" అంటున్నాడు.

ఈసారి జైలు మొదటిగదిలోనే ఆగిపోలేదు. మనుష్యులతో నిండివున్న ఒక పొడుగాటి హాలులోంచి తీసుకుపోతున్నారు. అది గురువారం. ఖైదీల బంధువులు ఉతికిన బట్టలు తెచ్చి వాళ్ళవాళ్ళ కిచ్చుకుని మైలబట్టలు పట్టుకుపోతారు. మేం దీనంగా లోపలికిపోతోంటే వాళ్ళంతా ఒకేచూడటం సానుభూతితో. అది నా కంతగా ఇష్టంలేదు. నా ముంజేతిని తలవరకూ ఎత్తి పిడికిలి బిగించాను. బహుశా శాల్యూట్ అని గ్రహిస్తారు. లేకపోతే ఏదోలే అనుకుంటారు నాకుమాత్రం అంతకంటె సత్తాలేదు ఒక్కముక్క చెప్పటానికూడా. జైలు ఆవరణలోనే స్ట్రెచర్‌తో సహా నన్ను పోలీసు లారీలో పడుకోబెట్టారు. ఇద్దరు నాజీ సైనికులు రివాల్వర్లమీద చేతులుపెట్టి నా కిరుపక్కలా నిలబడ్డారు. లారీ వెడుతోంది. రోడ్డు అధ్వాన్నంగావుంది. గుంటల్లోంచి, గోతుల్లోంచి చక్రాలెగిరిపడుతున్నాయి. రెండువందల గజాలైనా వెళ్ళలేదు; నాకు స్పృహతప్పిపోయింది. ప్రేగ్ వీధుల్లో ఇలాతిరగటం బలే తమాషాగా వుంది. ముప్పైమంది ఖైదీలుపట్టేలారీ ఒకడికోసం పెట్రోల్ తగలేస్తోంది. ఇద్దరు సైనికులు ముందూ, ఇద్దరు వెనకాల నిలబడి ఈమధ్యలో పడివున్న శవం ఎక్కడ పారిపోతుందోనని హడలెత్తుతూ రివాల్వర్లమీద చేతులూ, నామీద రాబందుచూపులూ నిగిడించారు.

స్పృహతప్పి వుండటంవల్ల నన్ను "విచారించడం" అసంభవమయింది. మళ్ళీ పాంక్రాస్‌కు తిరిగిపోయాం. రెండో రోజుకూడా ఇదే తతంగం. పెచెక్ భవనం చేరేవరకూ స్పృహ తప్పలేదు ఈసారి. కాని, విచారణ ఎంతోసేపు జరగలేదు పోలిస్ కమిసార్ ఫ్రెడరిక్ "కొంచెం అజాగ్రతగా" నా మీద చెయ్యి వేశాడు దానితో నాకు స్పృహ తప్పిపోయింది.

తర్వాత కొన్నాళ్ళవరకూ నేనింకా బ్రతికేవున్నానా లేదా అనే సందేహం మాత్రం రాలేదు. నేను ప్రాణంతో వున్నాననే విషయాన్ని పదే పదే నాకు స్ఫురింపజేసింది. ఒకటే; జీవితానికి చెలికత్తె అయిన బాధ. ఏదో పొరబాటున నాలో ఇంకాప్రాణమున్నదని తెలుసుకున్న ఖైదీలంతా నాకు అభివందనాలు పంపారు. ఎలాగ? ఆ గట్టి జైలు గోడలమీద సిగ్నల్స్‌లాగ పదే పదే కొట్టడంద్వారా, తిండి తెచ్చిపెట్టే తోటి ఖైదీల జాలి చూపులద్వారా.

నా భార్యకు మాత్రం ఈ విషయమసలే తెలియలేదు. ఆమెకూడా మా జైలు కింది అంతస్థులో దూరంగా ఒక గదిలో మగ్గుతోంది. కొంతకాలం మాత్రం ఆశతో, ఆదుర్దాతో నన్ను గురించి విచారిస్తూవుంది. ఆ తర్వాత ఒకనాడు తోటి ఖైదీ ఒకామె వెళ్ళి మొదటిసారి నన్ను విచారణకు తీసుకుపోయి హింసపెట్టినప్పుడే ఆ గాయాలతో

చితికిపోయి మరణించానని చెప్పింది. వెంటనే ఆమె మతిభ్రమించి మెలికలు తిరుగుతూ కింద పడబోతే స్త్రీ గార్డు ఆమె ముఖంలో పిడికిలితో పొడిచింది. తాను విధి లేక, ఖైదీల పంక్తిలో వెళ్లి నిలబడింది. ఈ వార్తతో గుండె పగిలి, ఏడ్చే బలంగూడా మిగల్చని దుఃఖంతో, కారుణ్యంతో విప్పారుతున్న విశాల నేత్రాలతో, కఠోరంగా ఎదురు నిలబడ్డ గోడలకేసి చూస్తూంటే ఏమేమి భీభత్సదృశ్యాలు, భగ్నస్వప్నాలు కన్పించాయో గదా! మరునాడు ఇంకొక పుకారు విన్నది: తొలిరోజు చిత్రహింస నే భరించలేక, నేనే ఖైదులో ఉరిపోసుకున్నానని.

ఇన్ని రోజులూ నేను దుస్సహమైన శారీరకబాధతో, స్మృతుల వేదనతో పక్క మీదనే అటూ ఇటూ పొర్లుతున్నాను. నా ప్రేయసి 'గుస్తీనా'కు అతి ప్రియమైన ఒక గీతాన్ని ఆలపిస్తున్నాను. ఇంత ఆవేదనతో పాడుతున్నా ఆమె వినలేదు గదా!

ఇప్పుడామెకు తెలుసు, ఇప్పుడామెకు నా గానం విన్పిస్తుంది. పూర్వంకంటె దూరంగావున్నా నా గానం ఆమెకు అందితీరుతుంది. నాజీ గార్డులంతా నా గది పాడుతోందని తెలుసుకున్నా, ఆపవయ్యాని ఇప్పుడెవరూ తలుపుమీద దెబ్బకొట్టడంలేదు. ఇప్పుడందరికీ అలవాటే.

నా గది గానంచేస్తోంది. నా జీవితమంతా పాడుతూనే గడిపాను. బ్రతుకునంతా బహుస్వల్పకాలంలోకి కుదించుకుని జీవించే ఈ తుదిఘడియల్లో నా గానాన్ని ఎలా ఆపను! పెషెక్ తాతకుగూడా సంగీతమంటే మహావెర్రి. ఆయనికి కంఠమూ లేదు, సంగీతపరిజ్ఞానమూ లేదు. ఒక విచిత్రమైన వ్యక్తి. కాని సంగీతమే అతని ప్రేయసి. ఆమెనే అతను అద్భుతమైన భక్తిశ్రద్ధలతో ప్రేమిస్తాడు.

సూర్యోదయం సుందరంగావున్ననాడు, కొరడాలతో గుండెలుకంపిస్తున్ననాడు మేం పాడుకుంటూవుంటాం. ఒక కామ్రేడ్ చివరిసారిగా సెలవుతీసుకొని మృత్యుగహ్వరంలోకి వెడుతూంటే దుఃఖోపశమనంకోసం పాడుకుంటాం. తూర్పురంగంలో సోవియట్లు జయిస్తున్నాయని వార్తవస్తే సంతోషంతో గానమారంభిస్తాం. యుగయుగాలుగా తమ సుఖదుఃఖాలను వెలిబుచ్చటానికి మానవజాతి గానంచేస్తోనేవస్తోంది. మానవులున్నంతకాలం సంగీతం విన్పిస్తూనే వుంటుంది!

సూర్యుడు లేకపోతే జీవితం నిష్ప్రయోజనమైనట్లే, సంగీతం లేని జీవితం వృధా! సూర్యకిరణాలే సోకని మాకు సంగీతం ఎంతైనా కావాలి. సెల్ 267 ఉత్తరముఖంగా వుంది. అందుచేత సూర్యుడైనా వేసవిలో సాయంత్రంవేళమాత్రం కొన్ని నిమిషాలు మాకేసి చూస్తాడు. ఆ కొద్ది నిమిషాలకోసం కనిపెట్టుకొని నిలబడే తాత, సూర్యకాంతి తగలగానే అప్పుడే పోతుందే అనే విచారంతో బిక్కమొహం పెడతాడు... అంతకంటె విచారంగావుండే క్షణాలు అరుదు.

సూర్యుడు! లోకంపైకి తన కాంతిని ఎంత సాత్వికత్వంతో ప్రసరింప జేస్తాడో!

మానవుల కళ్ళముందే తన ప్రాణ కాంతితో ఎన్ని అద్భుతాలు సృష్టిస్తాడో! కాని, మానవులకు సూర్యరస్మికూడా కరువైపోయిందికదా!

ఒకనాటికి మనందరికోసం సూర్యకాంతి ప్రసరిస్తుంది! అతని వెచ్చని కాంతి కౌగిలిలో మనమంతా సుఖంగా ఓలలాడుతాం. ఇది ఊహిస్తే ఎంత ధైర్యం ఉప్పొంగుతుంది! కాని, ఒక చిన్న ప్రశ్న వేసుకుంటున్నాను. సూర్యకాంతి ఎప్పటికయినా మామీద ప్రసరిస్తుందా?

మా గది ఉత్తర ముఖంగా వుంది. ఎప్పుడో ఒకప్పుడు, అదృష్టం పడితే మాకు సూర్యాస్తమయ సౌందర్యం కన్పిస్తుంది. ఒహ్హో! తాతా! మరొకసారి సూర్యోదయాన్ని దర్శించగలిగితేనా!

---

(62వ పేజీ తరువాయి)

భూష : ఫోటోలో తీయలేకపోతే ఈ వెధవ పెట్టె యెందుకు?

[కెమేరా లాక్కుంటాడు. ఫోటో గ్రాఫరు పరుగెత్తిపోతాడు.]

రాము : నడవండి. బైటకుపోదాం.

లచ్చు : మన్ని పిల్చి చంపేస్తూన్నారు.

కిష్టప్ప : మనం సమ్మె చేద్దాం.

భూష : నడవండి.

[గుమ్మంలో సార్జంటు నిలబడి రివాల్వరు గురిపెట్టి రామయ్యను కాలుస్తాడు. భూషయ్య చేతిలోని కెమేరా విసురుతాడు. సార్జంటు చేతిలోని రివాల్వరు పడిపోతుంది.]

రాము: (పడిపోతూ) చంపేశాడు

[మిగిలిన కార్మికులు సార్జంటును పడగొట్టి నడిచిపోతారు.]

భూష : మనవాళ్లను తీసుకుపోదాం.

[నలుగురు కూలీలు రామయ్యను, మాణిక్యాన్ని ఎత్తుకొని వెళ్ళిపోతారు.]

లచ్చు : నడవండి! సమ్మె.

భూష : తలుపులు పగులగొట్టండి.

[కార్మికులంతా వుద్రేకంతో పోతారు. సార్జెంటు నెమ్మదిగా లేచి రివాల్వరు తీసుకుంటాడు.]

(67 వ పేజీ తరువాయి)

రమణారావూ నేనూ ఒక వరంగల్లు పల్లెపక్కగా కలిశాను. ఆ ప్రణయ కవి గుండెనిండా ప్రళయం వుంది. రమణ్ నేనూ కొన్నాళ్ళు విశ్రాంతికి యూనియన్ ప్రాంతాలకు వచ్చాం.

ఈ మధ్య నూజివీడు వెళ్ళితే మాకు పెద్దపెద్ద యెత్తైన రాజభవనాలు కనపడ్డాయి. ఇవన్నీ యింకా యూనియన్ ప్రాంతాల్లో వున్నాయేం?

"భారత ప్రజ సోషలిజం సోషలిజం అంటోంది. ఆ సోషలిజం తెలంగాణా పల్లెల్లో పసిపిల్లమాదిరి పెరుగుతోంది."

అంటున్నాడు రమణ్.

* ఇల్యా ఎహ్రెన్ బర్గ్ *

# సంస్కృతికి - సరిహద్దులు లేవు



## భవిష్యత్తును ప్రేమించనివాడు గతాన్ని గౌరవించలేడు

[రోక్లోలో జరిగిన ప్రపంచ మేధావుల మహాసభలో ప్రఖ్యాత సోవియట్ రచయిత ఇల్యాఎహ్రెన్ బర్గ్ ఇచ్చిన ఉపన్యాసం ఈ క్రింద ప్రకటిస్తున్నాము. సం.]

ఇప్పటికి పదమూడేళ్ళ క్రితం పారిస్‌లో సంస్కృతిరక్షణకోసం జరిగిన అంతర్జాతీయ రచయితల మహాసభను ఈ సందర్భంలో ఉదాహరించకుండా వుండలేను. ఆ మహాసభలో సోవియట్ రచయితలూ, ప్రపంచంలోని వివిధదేశాల అభ్యుదయ రచయితలూ మానవ సంస్కృతికి కలుగబోయే ప్రమాదాన్ని గురించి హెచ్చరించారు. వారి హెచ్చరికల్లోని సత్యం కొద్ది సంవత్సరాల్లోనే స్పష్టమయింది.

మ్యూనిచ్ కుట్రలతో ప్రారంభమైన చౌకపారుబాణాసంచాతో సంవత్సరాల తరబడీ ప్రపంచాన్ని ఆవరించిన చీకటి, ఆ భయంకర ఫాసిస్టు ప్రభుత్వం బారిపడిన లక్షలాది ప్రజల మనస్సుల్లో, ఇంకా కలకవేస్తూనే వుంది.

భవిష్యత్తును చూసి భయపడేవాళ్లు గతాన్నికూడా గౌరవించరు. అయితే వాళ్లు సనాతనులమని చెప్పుకోవచ్చుగాని, నిజానికి వాళ్లు చరిత్ర చేతిలో కీలుబొమ్మలు.

అందువల్లనే, స్వార్థమే మతంగా పెట్టుకున్నవాళ్ళూ, డబ్బునూ అధికారాన్నీ పూజించేవాళ్ళూ అంతతేలికగా విదేశీ దాస్యాన్ని తలదాల్చారు; అందువల్లనే, ఆ మనుషులే, ఇవాళ, ఇంకా తేలికగా, తమజాతి దేవళాల్లో పూలు తెచ్చి అమెరికన్ బాటసారి వర్తకుల పాదాలకింద పరుస్తున్నారు.

నవప్రపంచంలోని స్త్రీ పురుషులందరూ మన పూర్వసంస్కృతికంతకే పూర్తిగా

వారసులని నేను నొక్కి చెబుతున్నాను. సంస్కృతిని రక్షించటమంటే దాన్ని ఇంకా ముందుకు తీసుకువెళ్ళటం కనకనే ఈమాట చెబుతున్నాను. సంస్కృతి అంటే మ్యూజియంలే కాదు, స్కూళ్ళుకూడా; లైబ్రరీలే కాదు, యువకుల ధైర్యసాహసాలుకూడా. సంస్కృతికి నీరాజనాలెత్తి, చూసి గర్వపడుతూ కూర్చుంటే చాలదు; ప్రతిక్షణమూ సంస్కృతిని నిర్మించాలి.

అక్షాంశ రేఖాంశాలనుబట్టి, మనం మానవ సంస్కృతిని, వివిధప్రాంతీయంగా, విభజించడంలేదు. చరిత్ర సచేతనమైందని మనకు తెలుసు. సృజనాశక్తిని అణగద్రొక్కే, సంకెళ్లు తయారుచేసేవాళ్లు పశుత్వాన్ని వరించిన మూర్ఖులవుతారు. వాళ్లు మొదట భవిష్యత్తును ఎదుర్కొంటారు; మార్క్స్ ఎంగెల్సుల పుస్తకాలు తగులబెడతారు; తర్వాత పురాతన శిల్పసంపదనీ, మ్యూజియంలనీ, లైబ్రరీలనీ ధ్వంసం చెయ్యటానికి తయారవుతారు.

ఒకవంక యుద్ధ సన్నాహాలు చేస్తూ 'పాశ్చాత్య సంస్కృతి' రక్షణను గూర్చి మాట్లాడేవాళ్ళ కపటనాటకాన్ని బట్టబయలు చెయ్యటం, ఈనాడు, అభ్యుదయ దృక్పథంకల మేధావుల ప్రధాన కర్తవ్యాల్లో ఒకటి.

ఈ పెద్దమనుషులు ఎవరెవరితో కలిసి 'పాశ్చాత్య సంస్కృతి'ని రక్షించబూనుకున్నారో ఒక్కసారి చూస్తేచాలు, వీళ్ళ నిజమైన ఉద్దేశాలేమిటో చెప్పవచ్చు. జెనరల్ ఫ్రాంకోతోను, గ్రీసును రక్తంలో ముంచెత్తిన కిరాతకులతోను, రర్ ప్రాంతపు నాజీలతోను, టోగ్లియాటీని చంపటానికి ప్రయత్నించిన కొత్తఇటాలియన్ ఫాసిస్టులతోను, తోటి మనుష్యుల్ని బానిసలుగా కొనుక్కునే అలబామా ధనికులతోను, అమెరికన్ రచయితలను జైళ్ళలోకుక్కిపెట్టుబడిదార్లతోను, నీగ్రోలను చిత్రవధ చేసే మిసిసిపీ భూస్వాములతోను, పరిణామవాదానికి బదులు 'ఆడమ్_ఈవ్' కట్టుకథల్ని చెప్పే టెన్నెసీలోని మూర్ఖ భూస్వాములతోను, ఫ్రాంసు దేశాన్ని హిట్లరుకు ధారాదత్తంచేసిన దేశద్రోహి పెటాన్ ముఠాతోను, జెహూటతోను, టర్కీ సైనికులతోను, గబ్బాషాలాంటి జూదగాళ్ళతోను వియత్నాం ఇండోనీషియాలను అణగద్రొక్కజూస్తున్న సామ్రాజ్యవాదులతోను పాశ్చాత్య సంస్కృతినిగాక, పాశ్చాత్య కరెన్సీ గొప్పతనాన్ని సరైనసమయంలో గమనించిన ప్రతిగెస్టాపోవాడితోనూ కలిసి ఈ పెద్దమనుషులు 'పాశ్చాత్యసంస్కృతి'ని రక్షించాలనుకుంటున్నారు.

సోవియట్ యూనియన్ దాడినుంచి 'పాశ్చాత్యసంస్కృతి'ని రక్షించాలని వీళ్లు చెబుతున్నారు. ఇందులో కొందరు 'యూరోపియన్ సంస్కృతి' రక్షణను గురించే ప్రస్తావిస్తారు; మరీ తెలవైనవాళ్లు కొత్తగా 'అట్లాంటిక్ సంస్కృతి' అని ఒకటి కనిపెట్టారు.

చాలా విశాలంగా కన్పించే ఈ 'అట్లాంటిక్ సంస్కృతి'ని గురించే ముందు మాట్లాడదాం. దీన్ని సృష్టించిన వాళ్ళ దృష్టిలో

ఈ పదానికి అట్లాంటిక్ మహాసముద్ర తీరంలోని అమెరికా యూరప్ దేశాల సంస్కృతి అని అర్థం. కాని, నిజానికి వీళ్లు ఈ విషయంలో అంత కచ్చితంగా లేరు. మధ్యధరా ప్రాంతంలోని ఇటలీని గానీ, రైనునదీ ప్రాంతంలోని పశ్చిమజర్మనీని గానీ, గ్రీసునుగానీ, పూర్తిగా ఆసియాకు చెందిన టర్కీనిగానీ ఈ 'అట్లాంటిక్' సంస్కృతీ దేశాల కూటంలో చేర్చుకోటానికి వీళ్ళు సందేహించటంలేదు.

## ఫ్రాన్సులోని పారిస్‌కూ అమెరికాలో డిట్రాయిట్‌కూ ఉన్న సంస్కృతీ సంబంధం ఏమిటి?

బహుశా, ఇది అమెరికా జనాభాలో ఎక్కువమంది పాశ్చాత్య యూరప్ దేశాల నుంచి తరలివచ్చినవాళ్ళు కావటమా? అయినట్లయితే, ఆస్ట్రేలియన్లూ దక్షిణాఫ్రికా బానిస యజమాన్లూ ఈ 'అట్లాంటిక్ సంస్కృతి'లో భాగస్వాములు కావాలి గదా? ఒకేరకమైన జీవితవిధానాలను బట్టిగానీ, ఆచార వ్యవహారాలనుబట్టిగానీ, అభిరుచుల్నిబట్టిగానీ ఈసంబంధం వుందా?

ఇక 'యూరోపియన్ సంస్కృతి' ఏమిటో చూద్దాం. యూరోపియన్ రాజధానీ నగరాల్లో ఒకటిగా పారిస్ కున్నంతగానూ, కనీసం వాషింగ్టన్‌కంటె అధికంగానూ, మాస్కోకుకూడా అధికారం వున్నది కనక, మాస్కోను వదిలేసి వీళ్ళు చెప్పే 'యూరోపియన్ సంస్కృతి' అంటే చరిత్రనూ భూగోళశాస్త్రాన్నీ తిరస్కరించట మవుతుంది

ఇప్పుడు బాగా డబ్బావాయించబడుతున్న 'పాశ్చాత్యసంస్కృతి'ని గురించి విపులంగా చర్చిస్తాను. 'పాశ్చాత్య సంస్కృతి' అంటే రష్యన్ సంస్కృతికి విభిన్నమై పూర్తిగా విరుద్ధమైన దేదన్నా మరొకటి వుందా? వుంటే, దాన్ని 'ప్రాచ్య సంస్కృతి' అనబోతున్నారా? అలా అన్నట్లయితే, మొదటినుంచీ ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల మధ్యవున్న సజీవసంబంధం దృష్ట్యా, చారిత్రకంగా అది అబద్ధం.

పురోగమిస్తున్న ఫ్రాన్సు, పోలెండు, ఇటలీలను ఉత్తేజపరచిన ఆశలనూ, ఆకాంక్షలనూ, ఆశయాలనూ రష్యాకూడా అనాది నుంచీ పంచుకుంటూనే వుంది. పశ్చిమయూరప్ దేశాలు సృష్టించిన ఉత్తమ సంస్కృతీ విజ్ఞానాలను కించపరచటం నాకేమాత్రమూ ఇష్టంలేదు. అయితే, పంతొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంలో రష్యన్ నవలాసాహిత్యం రాకపోతేనూ, టాల్‌స్టాయ్, డోస్టవిస్కీ, టర్జినీవ్, చెకోవ్‌లు లేకపోతేనూ—ఈనాడు ఫ్రాన్సు, ఇంగ్లాండు అమెరికాల సాహిత్యం ఎక్కడవుండేదో ఈ 'పాశ్చాత్య సంస్కృతీ' వాదులు చెబుతారా?

లేదా, సంగీతం తీసుకోండి షోవిస్కీ ముసోర్గిస్కీలను వదిలేసిన పాశ్చాత్య

సంగీత చరిత్రను ఎవరైనా ఊహించగలరా?

బహుశా, ఈ 'పాశ్చాత్యసంస్కృతి' కీ మరో ఏదో సంస్కృతికీ మధ్య సరిహద్దు గీసింది జారిస్టు రష్యావిషయంలో కాక సోవియట్ రష్యావిషయంలో నా? అయితే మాక్సింగోర్కీ, మాయకోవ్‌స్కీ, నెరూడాలా మిత్రుడే కదా! అనేకమంది పశ్చిమయూరప్ అమెరికా రచయితలకు గురుపీఠమే కదా!

అతిశేత వయస్సులోవున్న సోవియట్ సాహిత్యం తోటిదేశాల రచయితలకు వైజ్ఞానికంగా ఎంతో తోడ్పడింది; ముఖ్యంగా సామాన్యమానవుడియందూ పనియందూ, సృజనాశక్తియందూ రచయితల్లో ఒక కొత్త దృక్పథం కలిగించింది. కవిత్వం అనువదించటానికి అసాధ్యమైనదే. అయినా, మాయకోవిస్కీ ప్రపంచ మంతటా ప్రచారంలోకి వచ్చాడు. ఈకాలపు మహాకవుల్లో_ఒక ఆరగాన్‌గానీ, పాబ్లో నెరూడాగానీ, టూవింగానీ, నెజ్వాల్ గానీ సోవియట్ ప్రజల జీవితంనుంచీ కవిత్వం నుంచీ ఉత్తేజం పొందనివారులేరు.

ఇప్పుడు ఒక మిసిసిపీ ప్లాంటరుగానీ వాటికాన్ జెసూట్‌గానీ సోవియట్ యూనియన్‌నుంచి 'పాశ్చాత్యసంస్కృతి'ని రక్షిస్తామంటున్నారంటే, దాని అర్థం ఇది: తమ బానిసల మనస్సుల్ని_అది అమెరికా సంస్కృతిగానీ, ఇటలీ సంస్కృతిగానీ, ఫ్రెంచి సంస్కృతిగానీ_ఏ సంస్కృతి నుంచైనా దూరంగావుంచాలని చూస్తున్నారన్న మాట.

ఎంత వైపరీత్యం! అమెరికా పెట్టుబడిదార్లు ఫ్రెంచి బంట్లు 'పాశ్చాత్యసంస్కృతి'ని జోలియట్ క్యూరీ ప్రెనాంట్‌ల నుంచీ, ఆరగాన్ ఎలార్డుల నుంచీ, పికాసో మాటిసీలనుంచీ రక్షిస్తారట!

అమెరికన్ కాంగ్రెస్‌వాది థామస్ అనే ఒక మూరుడు 'పాశ్చాత్య సంస్కృతి'ని హోవర్డుఫాస్ట్, చార్లీచాప్లిన్, కాల్డ్వెల్ ల నుంచి కాపాడుతున్నట్టున్నాడు! వెనక పోలెండు ప్రధానిగావుండిన మైకోలజిక్ అమెరికాకు పారిపోయిన తర్వాత, పోలెండు ఎక్కడో దూరప్రాచ్యంలో వున్నట్టు మాట్లాడారు! కొద్దిమంది పెట్టుబడిదారుల 'పాశ్చాత్య' కార్యకలాపాలకు పోలెండు ప్రజలు స్వస్తిచెప్పాక, ప్రేగ్ విశ్వవిద్యాలయం పూర్తిగా ఆసియా ఖండానికి చెందినదైపోయింది!

సంస్కృతి నిజంగా ప్రమాదంలోనేవుంది. అయితేఅది 'పాశ్చాత్య' సంస్కృతీకాదు, 'ప్రాచ్య' సంస్కృతీకాదు_మానవ సంస్కృతి. ఈ 'పాశ్చాత్యసంస్కృతీ' రక్షకభటులవల్లనే మానవసంస్కృతి నేడు ప్రమాదంలోవుంది.

గొప్ప శాస్త్రవేత్తలూ, ఉత్తమ రచయితలూ, శిల్పులూ_ఇలాంటి అనేక ఉత్తమశక్తులు అమెరికాలో ఉన్నాయని నాకు తెలుసు. అయితే, యూరప్‌ను అమెరికా పాదాక్రాంతం చేసుకోవాలని చూస్తున్నది, అమెరికన్ మాయనాగరికత, ముసుగువేసుకున్న కోటీశ్వరులు కాని, వారు కాదు అమెరికా మేధాసంపత్తిని గౌరవిస్తూనే, మనం దక్షిణఅమెరికా ప్లాంట

ర్లనూ, డాలర్ మతాన్నీ- థామస్‌మంట్‌ల జాతిద్వేషాన్నీ తిరస్కరిస్తాం

పాశ్చాత్య యూరప్‌దేశాలమీద దండెత్తుతున్న అమెరికన్ సైనికులు ఈన్‌స్టిన్, సీన్‌బెక్, ఫాల్క్‌నర్, ఫాస్ట్, హెమింగ్వే, చాప్లిన్‌ల సంస్కృతిని తీసుకురావటంలేదు. ఒకరకం నల్లమందులాంటి చౌకబారు డిటెక్టివ్ నవలలనూ సెంటుఫిలింలనూ మాత్రమే తెస్తున్నారు. యూరప్‌కు మత్తుమందుపెట్టి, తేలికగా శృంఖలాబద్ధం చేద్దామని వాళ్ళ ఉద్దేశం. ఇది యూరప్ ప్రజల జాతీయ వ్యక్తిత్వాన్నీ, విశిష్ట స్వభావాల్నీ, వివిధజాతుల సమైక్యతనూ వంచించే ప్రయత్నం.

పిలవనిపేరంటానికి వచ్చిన ఈ 'సంస్కృతీ' రక్షకులు పారిస్, లండన్, రోమ్‌లకు ప్రబోధం చెయ్యటానికి బయలుదేరారు. ఎంత భయానకమైన దృశ్యమో చూడండి : (అమెరికన్) యజమానికి జాతీయవాదిగా వుండేందుకు సౌకర్యంవుంది_ అతడు తానేదో గొప్పజాతికి ప్రతినిధినని తానే యజమానిననీ అనుకొంటున్నాడు. అతని తొత్తులు, నిన్నా మొన్నటిదాకా 'అచ్చమైన జాతీయవాదుల'మని చెప్పుకున్నవాళ్లు. ఇవాళ 'విశ్వసౌభ్రాతృత్వ' వాదులైపోతున్నారు !

ఈమధ్య తరచుగా పేర్కొనబడుతున్న 'యూరపియన్ సమాఖ్య' ఆయాదేశాల ప్రజల సమాఖ్యకాదు ; అక్కడక్కడి బట్లర్ల, మేనేజర్ల, వాళ్ళవాళ్ళ భృత్యుల సమాఖ్య_బలాత్కారంగా సమీకరించబడ్డ సేవకుల బృందం.

భవిష్యత్తును ప్రేమించలేనివాడు గతాన్ని గౌరవించలేడనిచెప్పాను. దీనికి మరొక్కమాట చేరుస్తాను సోదరదేశాల ప్రజల్ని ప్రేమించలేనివాడు తనదేశప్రజల్ని సైతం ప్రేమించలేడు.

సామ్రాజ్యవాదులుచెప్పే జాతీయ విశ్వసౌభ్రాతృత్వం పేరిటి మైకాన్ని మనం మన దేశభక్తితోనూ అంతర్జాతీయదృక్పథంతోనూ ఎదుర్కొంటాం. సోదరదేశాల సంస్కృతీ విజ్ఞానాలపట్ల మనకు అత్యంతాదరం వుంది. మైకీవిజ్, స్లొవాకీ, చోపిన్ల పోలిష్ కళాఖండాల్లోని ప్రతిభా, అద్భుత రచనా, పౌరుషం, శృంగారం - ఇవన్నీ మనకు తెలుసు. ఏ జ్యూలిస్‌మాచ్‌గానీ, ఫ్రెంచిప్రజల ప్రతిభావిశేషాన్నీ, రింబా, కోర్బెట్, పాశ్చర్, జోలాల ఫ్రాన్సునూ మనం విస్మరించేటట్టు చెయ్యలేడు. థామస్‌లాంటి మూర్ఖుల విజయాన్ని చూసి, మనం అమెరికాప్రజల నిరంతర పరిశ్రమనూ ప్రతిభనూ మరచిపోము.

'ప్రజాశాంతి' అనే నినాదంతో మా రిపబ్లిక్ ప్రభవించింది. స్టాలిన్‌గ్రాడ్‌లో నెత్తురోడుస్తూ మా ప్రజలు 'ప్రజాశాంతి' నినాదం చేశారు.

ఇప్పటికి ముప్ఫైయేళ్లుగా మేము ఇతర దేశాల విషయాల్లో జోక్యం కలిగించుకుంటున్నట్టు ఆరోపిస్తున్నారు. పన్నెండు దేశాలు కబళించిన హిట్లరుకూడా మేము జోక్యం కలిగించుకుంటున్నామని నిందించాడు. ఇవాళ మళ్ళీ, ఈ కొత్త దురాక్రమణదారులు, సైనికస్థావరాలకోసం తాపత్రయపడేవాళ్ళు, అంత దూరం నుంచి యూరప్ దేశాల మంత్రివర్గాలను తీర్చిదిద్దే వాళ్ళు మామీద ఆఆరోపణే చేస్తున్నారు.

అయినప్పటికీ, మా విధానాలను గానీ, ఆచారవ్యవహారాలను గానీ, సంస్కృతిని గానీ ఇతర దేశాల ప్రజలమీద రుద్దట మనేది మా ఊహకు తగలని విషయం. మేము ఇతర దేశాల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకుంటున్నామనేది' గల్ఫ్ స్ట్రీమ్ నార్వే, డెన్మార్కుల వ్యవసాయంలో జోక్యం కలిగించుకోవటం వంటిదనీ, పూర్తిగా అసంబద్ధమైనదనీ నేను ఎప్పుడో వ్రాశాను. కాని మాఊరికే ప్రపంచవాతావరణాన్ని మార్చిన మాటమాత్రం నిజం.

ఫ్రాన్సులో గానీ, ఇటలీలో గానీ మూడో వంతుమంది కమ్యూనిస్టులకు వోటు చేసారంటే, మేము ఇతరులలాగా అక్కడ ప్రజల్ని భయపెట్టటంవల్లగానీ లంచాలివ్వటంవల్లగానీ కాదు. కాని, ఇవాళ అక్షర జ్ఞానంలేనివాళ్ళకు కూడా స్టాలిన్ గ్రాడ్ అంటేనూ, స్టాలిన్ అంటేనూ తెలియటం వల్లనే అలా వోటు చేశారు.

సోషలిస్టు సంస్కృతిని బూర్జువా సంస్కృతితో పోల్చిచూపటం లేదేమని నన్ను మీరు ప్రశ్నించవచ్చు. అందుకు కారణం ఏమంటే, ఈ 1948 లో బూర్జువా సంస్కృతి గురించి ప్రస్తావించటం అప్రస్తుత మనుకొంటాను. ఇంక బూర్జువాసంస్కృతి అనేదేమీ లేదు; అది బూర్జువా దౌర్జన్యానికి దారితీసింది. ఈ బూర్జువా దౌర్జన్యం రిఫ్రిజరేటర్లతోనూ, వ్యభిచారప్రచారం చేసే సుఖాంతాలతోనూ, ఇంజన్లతోనూ, ఊకదంపుడు చిత్రాలతోనూ, లాబరేటరీల తోనూ, మనస్తత్వాన్ని శోధించే నవలల తోనూ ఇమిడివుండవచ్చు. ఇన్ని వున్నా అది దౌర్జన్యమే అవుతుంది.

బూర్జువాజీ నిర్మాణదశలో వైజ్ఞానికంగా మంచి విలువల్ని సృష్టించారు; మానవ సంస్కృతీ చరిత్రకు దోహదం చేశారు. గతంలోని గొప్ప విలువల్ని మనం గౌరవిస్తాము. జర్మనీకి లొంగకపూర్వం ఫ్రెంచి ప్రభుత్వం తయారుచేసిన శాస్త్రజ్ఞులనూ, రచయితలనూ, కళాకారులనూ కూడా గౌరవిస్తాము.

కాని, పెట్టుబడిదారీ తత్వం నిర్మాణదశలోవున్న రోజుల్లో బాల్జాక్ జీవించాడు. పెట్టుబడిదారీ తత్వం విధ్వంస దశలోవున్న ఈ రోజున మరో 'బాల్జాక్ ప్రభవించటం అసంభవం. పాశ్చాత్య దేశాల్లో ఈనాడు సజీవమైన, విలువైన ప్రతి ఉత్తమ కళాఖండాన్నీ సృష్టిస్తున్నది ఆయా ప్రజలకు సన్నిహితులైనవాళ్ళు మాత్రమే.

మనలాంటి "అభిప్రాయాలు కల రచయితలూ కళాకారులూ గొప్పవాళ్ళని మనం అంటామని ఎవరో అన్నారు. ఇది నిజం కాదు. మనతో కలవటంవల్ల వాళ్ళు గొప్పవాళ్ళు కాలేదు; వాళ్లు గొప్పవాళ్ళు కావటంవల్లనే మనతో కలిశారు. ఒకసత్యం గమనిస్తే మీకీవిషయం స్పష్టపడుతుంది: అత్యద్భుత ప్రతిభావిశేషం కలవాళ్ళుసైతం కాలాన్ని గమనించనప్పుడు వట్టిపోతున్నారు. పతనమార్గంపట్టిన బూర్జువాచరిత్రలో బొట్లూ తాగుబోతులూ తప్ప, ప్రతిభావంతులు కన్పించరు.

మానవజాతి సంస్కృతికి ఎవరు ప్రమాదం కలిగిస్తున్నారో గమనించకుండాగానీ, గమనించటానికి నిరాకరిస్తూగానీ, ఇంకా కొందరు మేధావులున్నారు. వాళ్ళింకా పరిశ్రమకూ దురాశకూ మధ్య, శిథిలనగరాలను పునర్నిర్మించేవాళ్ళకూ పునర్నిర్మించబడిన నగరాలమీద అటంబాంబులు వేయదలిచేవాళ్ళకూ మధ్య ఏదో రాజీ కుదర్చాలని ప్రయత్నిస్తున్నారు.

యూరప్ స్వాతంత్ర్యసమరంలో భయంకరత్యాగాలకు పాల్పడ్డదేశం మరో యుద్ధాన్ని ఆహ్వానించగలదా? నేను మాస్కోనుంచి వస్తూవుంటే, త్రోవలో ఒక్క పట్టణంకూడా ఫాసిస్టులు ధ్వంసం చెయ్యనిది కనిపించలేదు.

ఇంటికొక్కరినైనా బలిపెట్టని కుటుంబాలు మా దేశంలో చాలా కొద్ది. మేము మాటలతో మాత్రమే పోరాడలేదు. మేము శాంతికోసం పోరాడాం. మా పట్టణాలను పునర్నిర్మించుకోటానికీ, మా బాలబాలికలను అభివృద్ధిలోకి తెచ్చుకోటానికీ, మా పూలతోటలు పెంచుకోటానికీ అవకాశం కలిగించే శాంతి మాకు చాలా అమూల్యమైనది. మా ఆశయాలు విజయం పొందుతాయనే విశ్వాసం వుండటంవల్లనే మేము శాంతిని వాంఛిస్తున్నాము.

అయితే, యుద్ధాన్ని ఆహ్వానిస్తున్న వాళ్ళెవరు? నిజానికి, అమెరికా ప్రజలు కాదు; అమెరికా విధ్వంసకులే యుద్ధాన్ని కోరుకుంటున్నారు. సోషలిజం జయిస్తుందని వాళ్ళుకూడా నమ్ముతున్నారు. కనకనే వాళ్ళు చరిత్రగతిని అరికట్టాలని చూస్తున్నారు. భవిష్యత్తును రక్తసిక్తం చెయ్యటానికి ప్రయత్నిస్తూ, వాళ్ళు మాటాంకుల్ని చూసి ఆందోళన పడుతున్నట్టు నటిస్తారు వాస్తవంగా వాళ్ళు భయపడేది_మన టాంకుల్ని చూసికాదు; మన ట్రాక్టర్లనుచూసి, మన సాహిత్యాన్నిచూసి, మన భవిష్యత్తును చూసి.

రెండేళ్ళక్రితం నేను అమెరికాకు వెళ్ళి వచ్చాను. అక్కడ గతయుద్ధంలో శిథిలమైన ఒక్క గృహంలేదు, దుఃఖంతో నిండిన ఒక్క హృదయంలేదు. అది చాలా ధనవంతమైన దేశం. కాని నన్ను కలుసుకున్న వాళ్ళంతా మరోయుద్ధం ఎప్పుడు వస్తుందని అడిగారు. అమెరికా పెట్టుబడిదారులు 'యుద్ధం యుద్ధ'మని మనల్ని భయపెట్టజూస్తారు కాని, నిజానికి వాళ్ళు ప్రజల్నే భయపెట్టుకున్నారు. మనంకూడా తరచూ యుద్ధాన్ని గురించి మాట్లాడుతాం. కాని మరో యుద్ధాన్ని గురించి కాదు_ గతయుద్ధాన్ని గురించి; 1941 నాటి గడ్డురోజుల్ని గురించి.

మాకంటే ఎక్కువటాంకులూ, ఎక్కువ విమానాలూ కల శత్రువు హఠాత్తుగా మమ్మల్ని దెబ్బకొట్టాడు. మేము తెగించి నిలబడ్డాం, విజయం సాధించాం. మా ప్రజల నైతికబలాన్ని కూర్చిన చైతన్యం ఒక్కటేమాకు పెట్టనికోట; అదే మా ధైర్యం.

**మా విశ్వాసం మానవుడిలో; మానవుడే జయించాడు.**

ఇది నిజంగా ఆందోళన చెందవలసిన సమయం. అటు అట్లాంటిక్ సముద్రం మీద మంచు దట్టంగా కమ్ముకుంటున్నది. మా తునాతునకలైపోయిన తలుపులూ కిటికీలూ ఇంకా యుద్ధమంటే ఏమిటో మాటి జ్ఞప్తికి తెస్తున్నాయి (చూ. పే 88)

* అనిశెట్టి సుబ్బారావు *

# ద్వేషం !

నాకు తెలుసు !
నాకు తెలుసు !
ఉదయం కమ్మిన మబ్బులు
కుట్రపన్ను తున్నాయని
నాకు తెలుసు !

మూసుకుపోయిందిపగలు
మూర్ఛిల్లినశాంతిలాగ !
తల్లిలేనిపిల్లలాగ
ఆకసమేడుస్తోంది
నాకు తెలుసు !

పచ్చనిపొలాలు, గుండెలు
పక్షులు, మానవులపైన
తెల్లని నల్లని తెరలై
దిగిపోయెను జడివాన !
నాకు తెలుసు !

తలవిరబోసుకు రాత్రి
జలక్రీడలాడుతోంది !
వానరాత్రి పొదిగినద్వేషం
జగతిని కమ్ముతోంది
నాకు తెలుసు !

---

[సంస్కృతికి 87వ పేజి తరువాయి]

శాంతినిగూర్చి అనేక మహోప న్యాసాలువింటున్నాము,మంచిదే కాని శాంతిని శ్లాఘించటంతో తీరేదేమీలేదు శాంతిని రక్షించుకోవాలి, మన మన ప్రజానీకంతో కలిసి మనం ఈ మహత్తర కర్తవ్యాన్ని నిర్వర్తించగలం

* పాలకోడేటి సూర్యప్రకాశరావు *

# ఒరే!



గంగన్న : నాల్గు రోజులనుంచి జ్వరము. ఇంటిలో కాని డబ్బులేదు. పిల్లలు గోలచేస్తున్నారు. ఈ రోజు జ్వరము లేదు. ఒక కప్పు కాఫీనీళ్ళు త్రాగి బయలుదేరాలి. చేతులారా పిల్లలను చంపుకుంటానా? లేచేటందుకు శక్తి లేకపోయినా, నడిచేటందుకు బలము లేకపోయినా, పనిచేయక తప్పదు. కానియ్య (అని రిక్షాతీసుకొని బయలు దేరుతాడు.)

వెంకన్న : ఏయి రిక్షా, వడతావు? – స్టేష నుకు జరుగురుగా వెళ్ళాలి.

గం : కడతానండి-పావలా యిప్పించండి.

వెం : ఒరే, అలాగున అడుగుతావేమిటి? మామూలు మూడు అణాలు. కట్టేది పోలీసువారికి! బేడకు పోనియ్య, లేక పోతే కేసు బనాయిస్తా జాగ్రత్త-

గం : (తనలో) ఏమి మాటలు! ఏయ్ రిక్షా ఆపైన ఒరేయ్ అట, రా అట బేడా యిస్తాడట - రానంటే కేసు బనాయిస్తాడట జరిమానా ఎక్కడ యిచ్చుకోను. అసలే యింటిలో మూడు రోజులనుంచి పట్టెడన్నములేదు. పిల్లల కోసము తలవొగ్గక తప్పదు. (బహి రంగంగా, చిత్తం కానివ్వండి; బీదవాళ్ళం ఏమి చేయగలం,

వెం : ప్రాసిక్యూటింగు యిన స్పెక్టరుగారింటికి పోనియ్య.

* * *

సుబ్బారావు : ఒరే రిక్షా! హోల్డాలు రిక్షాలో పెట్టు. తొందరగా రైలు స్టేషనుకు వెళ్ళాలి.

గం : చిత్తం బాబు (రిక్షాలో హోల్డాలు పెడతాడు)

సుబ్బా : రైలువేళ అయింది-తొందరగా నడు. కాకివాలినట్లు స్టేషనులో వాలాలి.

గం : పోనిస్తున్నా బాబు.

(తనలో) ఒరే! ఒరే! ఒరే! బాబు! ఒరేఅని పిలుచుటకు కన్న తలిదండ్రు లకు, పెంచి పెద్దచేసిన అన్నదమ్ము లకు హక్కు-ఉంది. కేసు బనాయిస్తా నని బెదిరించి బేడ డబ్బులకు రిక్షా కట్టించిన పోలీసుజవానుకు హక్కు ఎక్కడవుంది? బేడ డబ్బులకు రిక్షా ఎక్కిన ఇన్‌స్పెక్టరుకు ఏమి అధికార ముంది? ఒరే-ఒరే-ఒరే! దరిద్రులకు గౌరవమెక్కడ! బీదలకు మర్యాద

• సంభాషణ •

ఎక్కడ! తన్నొగ్గక తప్పదు పిల్లలకు తిండిలేదు.

సుబ్బా: తొందరగా పోనియ్యి. రైలు దాటిపోతుంది. శవమయినా నీకన్న బాగా నడిచేటట్టు ఉంది రా.

గం: శవమునేబాబు. శవమునే. ఈలోకములో శవాలే ఎక్కువగావున్నాయి శవమునే. పరుగిడతా.

సుబ్బా: చాలా పెద్దమాటలు చెపుతున్నావు. కూలివాళ్ళకు తలతిరిగింది పోనియ్యి. డొక్క వాకలించేస్తా.

గంగ: మేము శవాలమే, శవాలడొక్కలనే వాలికలు చేయండి. పరుగిడుతున్నా బాబు - పరుగిడుతున్నా.

సుబ్బా: ఎటువంటి రోజులు వచ్చాయి! రిక్షావాడుకూడ పెంకి జవాబులు చెపుతున్నాడూ, వాడిమీద ఏదో కేసు పెట్టిస్తేగాని పొగరు తగ్గదు.

గంగ: పరుగిడుతున్నా బాబు, పొగరే, నాల్గురోజులనుంచి అన్నములేనివాడికి పొగరేబాబు, పొగరే!

సుబ్బా: చాలా పెద్ద కబుర్లు చెబుతున్నావు. ఇక మర్యాద దక్కదు - జాగ్రత్త!

గం: మాకు మర్యాదా! పొగరుబోతులకు మర్యాదా! ఒరేలకు మర్యాదా! లోకమంతా రామమయం - కాదు కాదు, లోకమంతా ఒరేమయం - లోకమంతా పొగరుమయం, రామకృష్ణులను రావణునకు బలియిచ్చినాము - ఒరే అని బిరుదు మా బీదలకు యిచ్చినారు.

సుబ్బా: నోరుముయ్యి, (అని కాలుతో తన్నును.)

గం: తన్ను బాబు, తన్ను. దేముడున్నాడా! బీదలకు దిక్కువుందా? నా పేరు గంగన్న కాదు, నా పేరు ఒరే, నా పేరు పొగరు- నా పేరే తిట్టు-

* * *

కృష్ణారావు: ఏమిటీ జనసమూహము - మోటారు గుద్దీసిందా - రిక్షావాడికి. తలమీద గాఢమైన దెబ్బలా-రిక్షాలో కూర్చున్న అతనికి ఏమీ దెబ్బ తగల లేదుగదా? రిక్షా విరిగింది- రిక్షావాడు చచ్చేటట్టు వున్నాడు?

గం: దాహము, దాహము- నా పేరు ఒరే నా పేరు పొగరు-నా పేరు శవము, నా పేరు తిట్టు. నా పేరు తన్ను-దాహం-దాహం.

కృష్ణా: నోరు తెరూ, ఇదిగో మంచినీళ్ళు. రెండుగుక్కలు త్రాగు.

గం: దాహం, దాహం. పోతోంది ప్రాణము, మంచి నీళ్ళు అంటే ప్రాణము లేచివస్తోంది. (అని కళ్లు మూయును).

# ప్రగతిసంస్కృతిపై ప్రభుత్వ దౌర్జన్యం



ఏప్రిల్ 22వ తేదీ మధ్యాహ్నం 12 గంటలకు బెజవాడ సర్కిల్ స్పెషల్ యిన్‌స్పెక్టర్ల నాయకత్వాన 6 లారీల సాయుధ పోలీసులు ప్రజాశక్తి ప్రెస్ ఆవరణనంతా చుట్టుముట్టారు. ఏవిధమైన ఆర్డరును చూపకుండానే అందరినీ బయటకు పొమ్మన్నారు. ప్రెస్‌ను, మిషన్లను ఎక్కడవాటిని అక్కడ ఆపివేశారు. ఆఫీసునంతా ఆక్రమించుకున్నారు. ప్రభుత్వ ఉత్తరువులేవని ప్రశ్నిస్తే అనవసరమంటూ చాల నిర్లక్ష్యంగా మాట్లాడారు. ప్రెస్ ప్రచురణ కార్యాలయం మొదలయిన ఆఫీసులను స్వాధీనం చేసుకునేముందు మధ్యవర్తులను తీసుకొనివచ్చి స్వాధీనం చేసుకునే వస్తువులను వ్రాసియివ్వమని అడిగితే అనవసరంగా గోలచేయకండి, మేము సర్వాధికారులం (ఆల్ పవర్ ఫుల్) అంటూ అందరినీ దౌర్జన్యంగా బైటకు నెట్టేశారు.

మర్నాడు టపాలో 'అంతరంగికం' అని వ్రాసివున్న పెద్ద ప్రభుత్వకవర్లు వచ్చాయి. వాటిలో ప్రజాశక్తి దినపత్రిక సంపాదకుడు ప్రచురణకర్త, ముద్రాపకుడు అయిన కాట్రగడ్డ రాజగోపాలరావుగారు (అప్పటికే ప్రభుత్వ ప్రజారక్షణ ఆర్డినెన్సుకింద జైలులో వున్నారు) ప్రజాశక్తి దినపత్రికనుగాని మరే యితర తెలుగు పత్రికనుగాని ప్రచురించరాదని నిషేధించబడింది. అంతేగాని పోలీసులు దౌర్జన్యంగా జరిపినట్లు, ఒక రిజిష్టర్డు ట్రస్టు ఆస్తియైన 'ప్రజాశక్తి' ప్రెస్‌ను, దాని శాఖలను మూసివేసి ఆవరణను ఆక్రమించుకొమ్మని ఎక్కడా లేదు. ఈ విషయాన్ని గురించి జిల్లాకలెక్టరుకు తెలియజేసినా అతీ, గతీ లేదు.

తరువాత ఒక నెలకు మరొక ఫర్మానా జారీచేయబడింది. అందులో కాట్రగడ్డ రాజగోపాలరావుగారు ప్రజాశక్తి ప్రెస్‌ను వుపయోగించ గూడదని నిషేధించారు. దానిలోకూడా ప్రెస్‌ను మూసివేయుటకు పోలీసులకు వుత్తరువు ఏమీ యివ్వలేదు. ప్రభుత్వం జారీచేసిన రెండు వుత్తరువుల ప్రకారమైనా పోలీసులచర్య చాల-నిరంకుశమని వేరే చెప్పనవసరంలేదు. ఇందువల్ల ప్రెస్‌లో పనిచేసే 150 మంది కార్మికులు నిరుద్యోగులయ్యారు. ఇప్పటికి కూడా వారు, వారి కుటుంబాలు భుక్తిలేక మాడవలసివస్తోంది. ఒక్క ప్రెస్ ట్రస్టుకే రోజుకు 300 రూ. నష్టంవస్తోంది. ప్రెస్‌లోని సామాన్లు చాలా ధ్వంసమైనాయి.

ప్రెస్ ఆవరణ, బిల్డింగులు, ఎస్. ఏ. పి. క్యాంపుగా మార్చబడ్డాయి. ఈ పరిస్థితులన్నీ ప్రభుత్వదృష్టికి తెస్తూ సివిల్ నోటీసు యివ్వబడింది. అయినా ప్రభుత్వం ఏవిచారణ లేకుండానే కొంత కాలయాపన చేసి చిట్టచివరకు ప్రెస్‌ను, ప్రెస్ మేనేజరుకు వప్పజెప్పమని వుత్తరువు యిచ్చింది. ఈ వుత్తరువు ప్రకారం ప్రెస్‌ను అప్పగించుకోమని సెప్టెంబరు 17న నాకు తెలియజేయబడింది.

కాని ప్రెస్‌ను మూసివేసి, ప్రెస్ ఆవరణను ఆక్రమించిన నిరంకుశ స్థానికాధికారులు అనేక పేచీలు పెట్టి చివరకు తప్పనిసరియై ప్రెస్‌ను, ఆఫీసును స్వాధీనం చెయ్యడానికి వప్పుకున్నారు.

స్థానికాధికారుల మడత పేచీలను తెలుపుతూ జిల్లా మేజస్ట్రీటుకు ఒక పిటిషన్ పెట్టాను. ప్రభుత్వ వుత్తరువు ప్రకారం ప్రెస్‌ను ఆవరణతో సహా అప్పగించాలని వుత్తరువు జారీచేయబడింది. ఈ తతంగమంతా నడచినతరువాత 26 సెప్టెంబరున, అప్పటికి ప్రెస్‌లోనున్న సామానుల లిస్టు తయారుచేయబడింది. అప్పటికింకా యస్. ఏ. పి. ఆవరణను ఖాళీచేయలేదు. తరువాత మూడురోజులకు ఖాళీచేసిపోతూ మొదట లిస్టులో చూపబడ్డ డ్రాయర్లు, కుర్చీలు మొదలైన కొన్ని సామానులు దౌర్జన్యంగా ఎత్తుకుపోయారు.

యస్. ఏ. పి. వాళ్ళు ఆఫీసులో సామానులన్నీ రెండు మూడు గదుల్లో విరజిమ్మారు. ప్రెస్‌లోని సామానులు ధ్వంసం చేశారు ధనధనమని వచ్చిన ధ్వనులు బయటకుకూడ వినబడ్డాయి ఆఫీసులో టైపంతా అమ్ముకున్నవి అమ్ముకోవడం, మిగతాది పొలాల్లో పారబోశారు తరువాత, పోలీసులు వెదజల్లిన టైపును పిల్లలు ఏరుకొనివచ్చి మిఠాయి కొనుక్కొనేవారు. ప్రెస్‌లోని కొయ్య సామానులు విరగగొట్టి పొయ్యిలోకి పేళ్ళుగా వుపయోగించారు. పుస్తకాలు, బ్లాకులు, ప్రెస్‌లోని యితర సామానులు వగైరా రోజూ సరదాగా భోగిమంటలు వేసి తగులబెట్టారు. లైబ్రరీ పుస్తకాలు ప్రజాశక్తి ప్రచురణాలయం పుస్తకాలు బండిమీద ఎరువు తోలినట్లు లారీలతో పొలాలలోకి తోలివేశారు.

గదిలో కప్పువరకు టైపు కేసులు, రాకులు, స్టాండులు మొదలైనవి గుట్టవేసి వున్నాయి. ఎస్. ఎ. పి వాళ్లు పారపోయగా, అమ్ముకోగా, తగలబెట్టగా మిగిలిన టైపుకంతా కలగలిపి ఒక మూల గుట్ట పోసివుంది. స్టాండులు, రాకులు సగానికి సగం కూడా లేవు. ఇనుపపెట్టెతో సహా బద్దలుగొట్టి అందులోని డబ్బుకూడా కాజేశారు. ఆఫీసులో ఒక ఫైలుగాని, అక్కౌంటు పుస్తకంగాని, స్టేషనరీ గాని ఏమీలేవు. స్వాధీనం చేసుకొనే రోజున మిషన్ల భాగాలన్నీ విరగగొట్టారు. ప్రక్కనే వున్న పుస్తకాలు కుట్టే మిషను బెజ్జాలు వేసే మిషన్, ఫ్రాంకింగ్ (పోస్టలు స్టాంపులు వేయునది) మొదలగు వాటి భాగాలుకూడా విరగగొట్టారు. ఆఫీసులోని హాస్పిటలు పూర్తిగా అంతర్ధానమయింది.

(మిగతా 94వ పేజీలో)

## * గ్రంధ సమీక్ష *

### 'ఇండియా'

సిరిసంపదలకూ, కళా వైభవాలకూ, ఉత్తమ నాగరికతలకూ నిలయమైన ప్రాచీన భారత సమాజవ్యవస్థలోని మంచీ - చెడ్డ లేమిటి? ఈ వ్యవస్థ ఎందుకు అధోగతికి దిగజారింది? బ్రిటిష్ దోపిడిదార్లు కొల్లగొట్టడానికి కలిగిన అవకాశాలేమిటి? ఈ దుర్భరదాస్యంనుంచి మనజాతిక్రమేణా ఎలా పురోగమించుతోంది?

ఈ ప్రశ్నలకు ఈనాటికీ సమాధానం చెప్పలేని చరిత్రకారులూ, రాజకీయ వేత్తలూ చాలామంది ఉన్నారు. కాని గత శతాబ్దంలోనే మార్క్స్-ఏంజెల్స్‌లు వీటికి శాస్త్రీయమైన సమాధానాలిచ్చారు. వీరు చెప్పినది యదార్ధమని ఇటీవలి చరిత్ర రుజువుచేస్తోంది.

మార్క్స్ - ఏంజెల్స్‌లు మనదేశాన్ని గురించి పత్రికల్లో ప్రకటించిన లేఖల్లో కొన్నిటి అనువాదమే ఈ పుస్తకం. 'విశ్వసాహిత్యమాల' వారు తతిమ్మా లేఖల్ని కూడా త్వరలోనే ప్రకటిస్తారని ఆశిస్తాం.

జనన్మోహన్ గారు అనువదించడంలో మరింత సరళభాషను ఉపయోగించాలి. అసలే విషయం జటిలం - దానికితోడు భాషకూడా జటిలమైతే చెప్పవలసిం దేముంది?

ప్రతివారూ చదివి గ్రహించగలిగిన ఈ గ్రంధాన్ని ఒక్క రూపాయికే అందిస్తున్న 'విశ్వసాహిత్యమాల' రాజమండ్రి వారు అభినందనీయులు.

### 'డిప్యూటీ ఛైర్మన్'

జపానీయులు ఆక్రమిత చైనాలో ఒక గ్రామంలో ఒక తొత్తును ఛైర్మన్‌గా చేసి, ప్రజల్ని మోసపుచ్చి దోపిడి చేయాలని - ప్రయత్నిస్తారు కాని చైనా గ్రామీణుల పవిత్ర మాతృదేశ పోరాటంముందు జపనీయులు సర్వనాశనమౌతారు. తెలంగాణాలో, సర్వత్రా, సామ్రాజ్యవాదులు వాళ్ళ ఏజంట్లూ ఇంకా పైశాచిక తాండవం చేస్తున్న ఈ రోజుల్లో - ప్రతివారూ చదవతగ్గ పుస్తకం.

### ప్రతీకార జ్వాలలు

'ఒక రష్యన్ మరణానికి పదిమంది నాజీ హంతకుల్ని బలికొంటాం' ఈ నినాదంతో రష్యన్ గొరిల్లాలు సాగించిన సమరాన్ని చిత్రించే చక్కని కథ.

ఈ పై రెండు గ్రంధాలూ విశ్వసాహిత్యమాల - రాజమండ్రి వారు ప్రకటించారు. వెల ఒక్కొక్కటీ రూపాయి.

## స్వీకారం

జమీందారుల రద్దుబిల్లా?
లేక రక్షణచట్టమా?
వెల: 0-4-0.
ప్రతులకు: ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం, గవర్నరుపేట, విజయవాడ.



(92వ పేజీ తరువాయి)

ఇక పుస్తకాలు చాలావరకు కనిపించ టంలేదు ఉన్నవికూడా వెంటపోగు గా గుట్టలెసి వున్నాయి. -

ఒక్క కమ్యూనిజానికి సంబంధించిన పుస్తకాలనేగాదు, గవర్నమెంటు గెజెట్లు, గవర్నమెంటు కమిషన్ల రిపోర్టులూ, సైన్సు, చరిత్రలకు సంబంధించిన గ్రంధాలు, నెహ్రూ, గాంధీల ఆత్మకథలను, భారత రామాయణ పురాణ గ్రంధాలనుకూడా నాశనం చేశారు.

'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా', ఇంపీరియల్ గెజిట్ మొదలగు వాటినన్నిటినీ ప్రక్కనేవున్న నిమ్మతోటలోని బురదలో పారవేశారు. పుస్తకాలు, ప్రెస్ సామానులు తగలబెట్టిన భోగిమంటల మసి గుట్టలు ఆఫీసు చుట్టూవున్నాయి. ఈదృశ్యాలన్నీ యిక్కడ జరిగిన దురంతాలను మచ్చుతునకలుమాత్రమే

ప్రజాశక్తి ఆఫీసును స్వాధీనం చేసుకొని పోలీసులు గావించిన యీ ఫాసిస్టు చర్యలను ప్రతివారూ తీవ్రంగా ఖండించాలని కోరుచున్నాను. వీటన్నిటికీ కారకులైన పోలీసు వుద్యోగులను ప్రభుత్వం నిగ్గదీసి ఎక్స్‌ప్లనేషన్ అడగాలి. ప్రజల సొత్తయిన ప్రజాశక్తి ప్రెస్సును గావించిన యీ విపరీత నష్టానికి పరిహారం యిప్పించాలి. ఆంధ్ర ప్రజలందరూ, యీ మా సక్రమ కోర్కెను బలపరచాలని విజ్ఞప్తిచేస్తున్నాను

# జనత

## మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

సంపాదకులు :

గంగినేని వెంకటేశ్వరరావు

బ్రాంచి ఆఫీసు : గవర్నరుపేట, బెజవాడ

విడిప్రతి : అర్ధరూపాయి

కొత్తగా వెలువడిన "జనత"కు మా హృదయపూర్వక స్వాగతమిస్తున్నాం. ఇంతవరకూ ఆంధ్రదేశంలో ఏ పత్రికకూ లేని రెండు విశిష్టలక్షణాలీ పత్రికలో కన్పిస్తున్నాయి. ఒకటి: సామాన్య ప్రజల జీవిత పరిస్థితులు చక్కబడటానికి గూడా అంతర్జాతీయ రాజకీయాల సమగ్రావలోకనం అత్యావశ్యకమనీ, రెండు: రాజకీయాలు అంటేగ్రూపులు, కులాలు, జిల్లాలు వాటి వాటి స్వార్థంకోసం పౌరజీవితాన్ని కలుషితం చెయ్యటంకాదని, మార్క్సిజం సంఘపరిస్థితుల నవగాహన చేసుకోడానికి వినియోగించే సైన్సు అనీ సంపాదకులు విశ్వసిస్తున్నారు.

"జనత" మార్క్సిస్టు విజ్ఞానంతో మన రాజకీయోద్యమాలకు చైతన్యం కలిగింప పూనుకోవడం ముదావహం.

ఐతే, ఆంధ్ర, భారతీయ సంఘ పరిస్థితులను వివరంగా పరిశీలించే వ్యాసాలు ప్రచురించడం, గెటప్ విషయంలో ఇంకా శ్రద్ధతీసుకోవడం అత్యవసరం. వెల తగ్గించగలిగితే మంచిది.

— అనిసెట్టి

# * మన పత్రికల పతనావస్థ *

## ★ లేఖ ★

అన్ని దేశాలలో లాగానే మన దేశంలో కూడ చితికిపోయిన బూర్జువా సంస్కృతి చివరిసారిగా పూర్వవాసనల నిశ్వాసాన్ని విడుస్తోంది. భవిష్యత్తుకు నీళ్ళువదలి, 'ప్రస్తుతం' అంచుమీద నిలుచోని గతంలో విశ్రాంతి తీసుకుంటున్నారు— బూర్జువా కళానేత్తలు, కళాకారులు, కళారాధకులూను. పతనదశలో వున్న బూర్జువా సంస్కృతి విషస్వరూపం అతినగ్నంగా, అన్ని దేశాలలో, అన్ని కళారూపాల్లో సాక్షాత్కరిస్తోంది.

ముఖ్యంగా ఈమధ్యవచ్చిన సినిమాలు పత్రికలుచూడండి. డబ్బుకోసం డైరెక్టర్లు ప్రొడ్యూసర్లు ఎంత అసభ్యమైన సెక్సు, నగ్న వేశాలను తీసికొని రావడానికైనా వెనుదీయటంలేదు. అదీగాక కొందరికి ఆనో కార్యక్రమం, పోటీతో కూడిన 'టెక్నిక్', 'హాబీ', 'హాబిట్' అయిపోయింది.

సారస్వతానికి సంబంధించిన వ్యక్తిని కావటాన, కొంతమంది రచయితలు, సంపాదకులు కల్గించిన బాధను, నా హృదయంలోని కోతను మీకు వ్యక్తంచేయడానికి ఈజాబు వ్రాస్తున్నా.

ఈ మధ్యనే అవతరించిన 'మదన' 'రేరాణి' పూర్తిగా ఒక planned, purpose న ప్రచారంచేయడానికి పూనుకున్నట్లు తెలుస్తుంది. ఇవి సెక్సు పత్రికలు. ఇవి చిత్రించేది ప్రజా జీవితం కాదు. కొంతమంది తీరని కోరికలకు ఆకారాలు కల్పించి అచ్చువేయటం; ఆడబొమ్మల అంగ సౌష్టవాలు, నగ్న చిత్రాలు పత్రికల నిండా నింపి డబ్బుచేసుకోవడం. వాస్తవ రచనల పేరుతో బూతులు, సెక్సు ఉద్రేకం, 'డెలిబరేట్' గా ప్రచురిస్తున్నాయి.

ఈ పత్రికలు నీతి పేరుతో అవినీతి, అరాజకం, అసభ్యత, అందజేస్తున్నాయి. ఆదర్శప్రేమ, స్వేచ్ఛా వివాహాల ముసుగుతో అమృత హృదయాలను విషపూరితాలుగా చేయడానికే ఉపకరిస్తాయి.

ప్రజల జీవితంతో సంబంధం లేకుండా ఊహాస్వర్గంలో విహరిస్తూ, దుర్భరమైన తమ జీవిత పరిస్థితులను సైతం త్రోసిపుచ్చి ఏదో ప్రేమగాని ప్రేమ పత్రికలనిండా నింపటం రచయితలు చేయకూడని, చేయరాని పని. ప్రజలు తమకంటే ముందుకు నడుస్తున్నారు. వారికంటె ముందుండాల్సిన మనం కనీసం వారితోనైనా నడవాలి. వారిని అర్థం చేసికోవాలి. వారి చిత్తప్రవృత్తిని చిత్రించాలి. వారు ముందుకువేసే ప్రతి అడుగు స్వార్థపరుడి శిరస్సుమీద వేసే ఒక్కొక్క సమ్మెటపెట్టు. అలాంటి ప్రజాపురోగమనాన్ని ప్రజాచైతన్యాన్ని అరికట్టే అడ్డుగోడలే ఈ పత్రికలు.

— శరత్

గురజాల

# అభ్యుదయ

## అమెరికన్ ప్రజాసాహిత్య సంచిక

డిసెంబరు 10 న వెలువడుతుంది

వెల: ఎనిమిది అణాలు

ఈ సంచికలో

★ కెనడానుంచి దక్షిణ అమెరికావరకూ గల ప్రజానీకం వాంఛల్ని ప్రతిబింబించే ఉత్తమ అమెరికన్ సాహిత్యం—

★ అమెరికన్ సామ్రాజ్యవాదుల పలుబడిక్రింద నీగ్రో ప్రజానీకం అనుభవిస్తున్న యమయాతనలనూ, వారి పోరాట శక్తుల్నీ చిత్రించే నీగ్రో సాహిత్యం —

★ అప్టన్ సింక్లేర్, జాక్ లండన్, హోవర్డు ఫాస్ట్, పాల్ రాబ్సన్, చార్లీ చాప్లిన్, పాబ్లో నెరూడా... కారల్ శాండ్‌బర్గ్, కెన్నెత్ పాచెన్ మొదలయిన అమెరికన్ సాహితీపరుల రచనలూ —

★ అమెరికన్ జీవితాన్ని గురించి గోర్కీ, ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ ఇల్ఫ్ అండు పెట్రోవ్ మొదలైన ప్రఖ్యాత సోవియట్ రచయితల రచనలూ —

★ హాలీవుడ్ చిత్రకళాపరిశ్రమను - అమెరికన్ ప్రజాస్వామిక సంస్కృతిని - గురించిన ప్రత్యేక వ్యాసాలూ —

కాంతులు పత్తులు, నిరపరాధ పరిశోధన.

ఏజంట్లకు హెచ్చరిక:

* నవంబరు నెల బిల్లులు నవంబరు 25 వ తేదీలోగా చెల్లించాలి.
* అమెరికన్ సాహిత్యసంచిక ఎన్ని ప్రతులు కావలసిందీ 25 వ తేదికే తెలియచెయ్యాలి.
* లోగడ బాకీలున్న వారికి పత్రిక పంపబడదు

మేనేజరు : అభ్యుదయ : విజయవాడ

Editor, Printer & Publisher K. Vina... Rao
Secretary, Andhra Progressive Writers' Association Governorpet.
Printed at Abhyudaya Press, Vijayawada.

